# ధర్మదీక్ష

(చారిత్రక నాటకం)



మధురాంతకం రాజారాం

ప్రచురణ :

ఆర్ట్ లవర్స్ యూనియన్ (రి.జి.) చిత్తూరు.

మొదటి ముద్రణ

1984



వెల

రూ. 6/-



ముఖచిత్రం

శ్రీ శీలావీర్రాజు

ముద్రణ :

రెమ్కో ప్రింటర్స్,

మిట్టూరు, చిత్తూరు.

ప్రతులకు :

ఆర్గనైజర్,

ఆర్ట్ లవర్స్ యూనియన్,

12-5-4, పిళ్లారిగుడి వీధి,

చిత్తూరు-517 001.

# ముందు మాట

నాటక కళా సేవ ప్రధాశయంగా 'ఆర్ట్ లవర్స్ యూనియన్' ఏర్పడి ముప్ఫైయేళ్ళు దాటింది. దీని సంస్థాపక సభ్యులలో నేనూ ఒక్కణ్ణి. ఈ సంస్థకు జీవగర్ర శ్రీ వి. జయరాం గారు. ఆయన వ్రాయించినవాడు. నేను వ్రాసిన వాణ్ణి. మా తొలి నాటకం 'ఆనాటి రాత్రి' 1951లో ప్రదర్శితమైంది. దానికి స్థానికంగా గణనీయమైన ప్రశస్తి వచ్చింది. ఆ ఉత్సాహమే మూలధనంగా నేను అగ్నిజ్వాల, ఆహుతి, చరిత్రహీనులు, జగన్నాటకం, రాణి సంయుక్త, మిస్ మనోరమ, వినోదమహల్ మొదలైన నాటకాలు, నాటికలు అనేకం రచించాను. జ్ఞాపకాలు తప్పితే వాటికి సంబంధించి యిప్పుడిక మిగిలిందేమీ లేదు. రెండు మూడు ప్రదర్శనలు జరిగేటప్పటికి వ్రాతప్రతి చిత్తుకాగితాలుగా మారి, కాలక్రమాన కనిపించకుండా పోయేది. జరిగిన నష్టానికి చింతిస్తూ జయరాంగారు ఇటీవల పదేళ్లనుంచీ నాటకాలను అచ్చొత్తించే బాధ్యతను గూడా తన భుజాలపైన వేసుకున్నారు. ఏతత్ఫలితంగా తమ కరకమలాల్లోకి వస్తున్న చారిత్రిక నాటకం - ధర్మదీక్ష.

దీని పుట్టుపుకు వెనుక బలవత్తరమైన కారణం ఒకటుంది. ఆంధ్రప్రదేశ్ నాటక అకాడెమీ నిరుద్యోగ కళాకారులకు ఆర్థికంగా కొంత చేయూత యివ్వడం కోసం ఒక పథకాన్ని రూపొందించింది. అందుకోసమని ఒక కొత్త నాటకాన్ని వ్రాయించి, నిరుద్యోగులైన కళాకారుల చేత ప్రదర్శన లిప్పించాలని నిర్దేశించి, ఈ ప్రణాళిక క్రింద చారిత్రిక నాటక నిర్మాణ బాధ్యతను చిత్తూరు ఆర్ట్ లవర్స్ యూనియన్ వారికప్పగించింది.

ఇల్లలకడమైంది గనుక ఇక పండుగ కావలిసిందేనని జయరాం పట్టు బట్టి కూచున్నారు. ఇతివృత్తపు ముత్తెపుచిప్పకోసం చరిత్ర సాగరంలో దూకమన్నారు. అసలైన ముత్తెపు చిప్ప దొరకడం కేవలం యాదృచ్ఛికం. అది చంద్రగిరి దుర్గం రాజధానిగా అరవీటిరాజులు దేశాన్ని పాలించిన కాలం. రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవడం కోసం కొన్ని కుటిల శక్తులు పన్నిన పన్నాగం కీలకమైన అంశంగా ఒక కథా సూత్రాన్ని నిర్మించుకుని, అంకవిభజన కావించుకుని, నాటక రచనకు ఉపక్రమించాను. ఏ రచయితకైనా ఏ మాత్రమో కొంత శక్తి యుక్తులుంటాయి. నాపరిమితులు అనుమతించినంతలో నాటకం యిలా రూపొందింది. శక్తివంచన మాత్రం జరగలేదు.

వెను వెంటనే యిది అచ్చుగాకపోవడానికి గూడా పూచీ నాదే. నాటక ప్రయోజనం ప్రదర్శనగా రక్తి గట్టడం. ఒకసారి ప్రదర్శన జరిగిన తర్వాత, బాగోగుల్ని గురించి పెద్దలతో చర్చించి, ఆ పైన అచ్చుపనికి పూనుకోవడం బాగుంటుందని నేను జయరాంగారికి సూచించాను. అక్టోబరు 1983 లో చిత్తూరు పి. సి. ఆర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల ఆవరణలో తొలి ప్రదర్శనం జరిగింది. అకాడెమీ ప్రతినిధితో బాటు పలువురు సహృదయులు సంతృప్తిని వెలిబుచ్చారు.

ఆప్త మిత్రులు డా॥ బి. భాస్కరచౌదరి, ప్రసిద్ధ నాటక రచయిత శ్రీ ఎస్. మునిసుందరం, సహృన్మిత్రులు శ్రీ శీలా వీర్రాజు గారల తోడ్పాటు అడుగడుగునా లభించింది. అందరికీ కృతజ్ఞుణ్ణి.

దామల్ చెరువు
6—3—1984

మధురాంతకం రాజారాం

# కృతజ్ఞతలు

కొత్తగా ఒక చారిత్రిక నాటకాన్ని రూపొందించి, స్థానికులైన నిరుద్యోగ కళాకారుల చేత ప్రదర్శనలిప్పించడానికి ఉదారంగా తమ ఆర్థిక సహాయాన్ని అందించిన ఆంధ్రప్రదేశ్ నాటక అకాడెమీ వారికీ—

పదిహేనేళ్ల 'గ్యాప్' తరువాత – ఒక నాటకం వ్రాసియిస్తానని మాటయిచ్చి, వాగ్దానం నిలబెట్టుకున్న నా బాల్యమిత్రులు శ్రీ మధురాంతకం రాజారాం గారికి—

నాటక ప్రదర్శనం విజయవంతంగావడానికి సంఘీభావంతో శ్రమించిన సర్వశ్రీ గాజులపల్లె యస్. ప్రభాకర్ (వేంకటపతిరాయలు) చింతం దేవనాథ్ (జగ్గరాజు), ఎ. దక్షిణమూర్తి (రంగభట్టు), సి. రాజశేఖర్ (సచ్చిదానందస్వామి), పి. నరేంద్రబాబు (శ్రీరంగ రాయలు), ఆంజనేయప్రసాద్ (చిక్కరాయలు), డి. యన్. సంపత్ (యాచమనాయకుడు), యం. యస్. యుగంధర్ (శిష్యుడు) ఆర్. బాలాజీప్రసాద్ (కంచుకి), కుమారి వై. లక్ష్మిప్రియ (రంగనాయకీ), శ్రీమతి బిందు మాధవి (మహారాణి) మొదలుగా గల సోదర నటులకు, నటీమణులకు—

వాద్య సహకారం అందించిన సర్వశ్రీ ఎ. దక్షిణామూర్తి యస్. టి. అరుసు, సి. యన్. రామన్, యం. ఎన్. రాజేంద్ర ప్రసాద్, యం. యస్. కుమారస్వామి తదితరులకు—

అడుగడుగునా నన్ను ప్రోత్సహిస్తున్న మా సంస్థ అధ్యక్షులు శ్రీ ఆర్. శ్రీనివాసరావు, ఉపాధ్యక్షులు శ్రీ ఎన్. ద్వారకనాథరెడ్డి, కార్యదర్శి సి. భక్తవత్సలు, కోశాధికారి శ్రీ కె. ఎన్. రఘు గార్లకు మరియు మా కార్యవర్గ సభ్యులకు—

ముద్రించి యిచ్చిన యెమ్కో ప్రింటర్స్ వారికి

ఆర్ట్ లవర్స్ యూనియన్ తరపున కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

చిత్తూరు,
16—3—1984

ఏ. జయరాం

# పాత్రలు

వేంకటపతి దేవరాయలు — చంద్రగిరి రాజ్యపరిపాలకుడు.

మహారాణి బయ్యమదేవి — రాయలవారి అరాంగి.

యాచమనాయకుడు — వెంకటగిరి సంస్థానాధిపతి. రాయలవారి ఆప్తమిత్రుడు.

గొబ్బూరి జగ్గరాజు — మహారాణి సోదరుడు, రాయలవారి బావమరిది.

శ్రీరంగరాయలు — రాయలవారి అన్న కుమారుడు.

చిక్కరాయలు — యువరాజు.

ఇవ్వాది రంగభట్టు — కుర్రకవి, యువరాజు చెలికాడు.

సచ్చిదానందస్వామి — అవధూత.

రంగనాయకి — దేవదాసి, రాజనర్తకి.

ఇంకా....

కంచుకి, శిష్యులు....



# 1

[చంద్రగిరి రాజప్రాసాదంలో అంత:పురమందిరం. ఒక నాటి రాత్రి, తొలిజాముగడిచిన వేళ.

రాచనగరంలోని పూజా మందిరంనుంచీ దేవదాసి రంగ నాయకి ఆలాపిస్తున్న భక్తి గీతం వినిపిస్తూ వుంది. వేంకటపతి దేవరాయలవారు పారవశ్యంతో ఆలకిస్తున్నారు. పాట పూర్త య్యేసరికి మహారాణి బయ్యాతూదేవి గూడా రంగంపైకి వస్తుంది.]

జయ మంగళా కార!
జయ సుందరా కార!
జయము శ్రీ వేంకటేశ!
జయమయ్యా
జయము ఓ శ్రీనివాస!

నల్లనౌరూపులో చల్లటి హృదయమ్ము
కడగంటి చూపులో కరుణామృతమ్ము
అధరాల దీపించు మధుర మందస్మితము
అతిలోక రమణీయమగును నీ రూపమ్ము....జయ....

ఏడుకొండల మేడ లెక్కి వచ్చిన వేళ
గర్భాలయమ్ములో కనిపించు నీ రూపు
కనులు మూసిన వేళ మనసులో భాసించి
తనువు నే గుడికాగ యొనరించు నీ రూపు....జయ....

[సభక్తికంగా నమస్కరించిన తర్వాత వేంకటపతి దేవ రాయలవారు తిరిగి చూస్తారు. మహారాణి కనిపిస్తుంది.]

రాయలు:—విన్నావా మహారాణీ! పాట వింటూవుంటే సాక్షాత్తుగా స్వామి సన్నిధానంలోనే వున్నట్టుంది గదూ!

రాణి:— ప్రతిదినం వింటున్నదే గదా! ఆ గొంతూ పాతదే. పాటా పాతదే....

రాయలు:— పాతబడే కొద్దీ కొన్నింటిపైన మక్కువ పెరుగుతుందే గానీ తరగదు మహారాణీ! సింహాసనం పాతదే గదా! వదులు కోగలమా? రాజ్యసుఖాలు పాతవేగదా! త్యజించగలమా? అంతెందుకు? ఈ శరీరం గూడా పాతదే నాయె. ఏదీ, విడిచిపెట్టాలంటే మనసు రాదే!

రాణి:— (చెవులు మూసుకుంటూ) హరి హరీ! ఏం మాటలు స్వామీయివి?

రాయలు:— కొన్ని కొన్ని ఔషధాలు కటిక చేదుగా వుండడం లేదా దేవీ! కొన్ని నిజాలు గూడా అట్లాగే కటువుగా వుంటాయి. చేదైనా ఔషధాన్ని మ్రింగి జీర్ణం చేసుకోవడం ఆరోగ్యానికి శ్రేయస్కరం.

రాణి:— మంచిమాటే! ఈ నడుమ నా ఆరోగ్యం గూడా తిన్నగా వుండడంలేదు. రాజ వైద్యులేవో మందులిస్తున్నారు. అయితే అవి (చిరునవ్వుతో) చేదుగా మాత్రంలేవు.

రాయలు:— రాజవైద్యులకు రాణీవారి ఆరోగ్యంకన్నా, రాణీవారి అనుగ్రహమే ముఖ్యం. అందుకని తమ చికిత్స విషయంలో కొంచెం మార్పు చేద్దామా మహారాణీ?

రాణి: — సెలవివ్వండి ప్రభూ!

రాయలు:— రాజే వైద్యుడైతే? అప్పుడెలా వుంటుంది?

రాణి:— అంతకంటేనా? మీ చేతులతో మీరు నేపాళ మిచ్చినా, అది నాకు అమృతమే!

రాయలు:— కానీ నేను మందులివ్వనురా! మందులాంటి మాటలు మాత్రమే చెబుతాను.

రాణి — చెప్పండి.

రాయలు:— భర్తృహరి - అని ఒక మహానుభావుడు. గొప్ప కవీంద్రుడాయన. సమస్త శాస్త్రాలు చదివినవాడు, అన్ని దేశాలూ తిరిగినవాడు. అయనంటాడు—అది అమరావతిని తలపించే సుందరనగరం. ఆరాజు పరాక్రమోపేతుడు. అదిగో, అదే అతడి నిండు పేరోలగం. వీరు మంత్రులు. వారు సామంతులు. వారు సేనాపతులు. వీరు భట, నట, గాయక, విదూషక, పౌరాణిక, వైతాళిక, వందిమాగధులు. ఇదంతా ఒకనాటికథ! నేడానగరమేదీ? ఆరాజేడీ? ఆపేరోలగమేదీ? ఆ వైభవమంతా ఏమైపోయింది? "ఈ మార్పు కంతటికీ కారణ భూతుడైన మహానుభావుడెవడైతే వున్నాడో - ఆ కాలమూర్తికి నమస్కారం" అంటాడు భర్తృహరి.

రాణి:— కాలగర్భాన కలిసిపోయిన విజయనగర వైభవాన్ని తలపుకు తెచ్చుకుంటున్నారా ప్రభూ?

రాయలు:— చరిత్రలో అంతకుమించిన చేదునిజం యింకొకటుంటుందా దేవీ? పారాణి పాదాలతో మహారాణులు విహరించిన చోట తొండలు, ఊసరవెల్లులూ తిరుగుతున్నాయి మల్లెలూ, మందారాలు విరిసి నవ్వినచోట జిల్లేళ్లు, ఉమ్మెత్తలూ యికిలిస్తున్నాయి. అపర దేవేంద్రుల చందాన చక్రవర్తులు కొలువైన చోట పుట్టలు పెరుగుతున్నాయి. ఈలాగున రాక్షసుడు పట్టి విడిచిన రంభలా తయారైన విజయనగరాన్ని చూచినప్పుడు ఏమనిపిస్తుంది దేవీ? ఏ రాజ్యానికైనా, ఏ వంశానికైనా వృద్ధితో బాటు క్షయమున్నా తప్పదని యిందువల్ల నిరూపణ కావడంలేదా?

రాణి:— (అనుమానిస్తూ) ప్రభువులిదంతా దేనికొరకో ఉపోద్ఘాతంగా చెబుతున్నట్టున్నారు....

రాయలు:—అవును మహారాణి! విజయనగర పతనానంతరం కర్ణాటక రాజ్యరమారమణి మా తండ్రి తిరుమలరాయల వారిని ఆశ్రయించి కొన్నేండ్ల పాటు పెనుగొండలో కాపురం పెట్టింది. ఆ పైన చంద్రగిరికి తరలి వచ్చింది.

రాణి:— తెలుసు ప్రభూ! అప్పటినుంచీ నేనూ గూడా ఈకథలో పాత్రనే! చంద్రగిరి దుర్గమే రెండవ విజయనగరంగా, మరల నొకసారి జన్మమెత్తిన శ్రీకృష్ణదేవరాయల వారి చందంగా, తమరు ధరణీ రాజ్యపాలనం గావిస్తున్నారు. తమ పాలనలో జనులు శత్రు భయం లేకుండా, ఈతి బాధలు చవిచూడకుండా సుఖోజయంగా జీవిస్తున్నారు. అంతేగదండీ!

రాయలు:— కాదు, నువ్వెక్కడైతే ముగించినావో, అక్కడి నుంచే కథ ప్రారంభమవుతుంది. నేనీ రాజ్యానికి రాజును కానని నీకెన్ని పర్యాయాలు చెప్పాలిదేవి? మళ్లీ మళ్లీ చెబుతున్నాను. నేను రాజ ప్రతినిధిని మాత్రమే!

రాణి:— ఎందువల్ల ప్రభూ?

రాయలు:— ఈ రాజ్యం మా అన్నగారిది గనుక. రాజుకు కొడుకు లెందరైనా రాజ్యం జ్యేష్ఠునికే సంక్రమించడం సాంప్రదాయం గనుక!

రాణి.— ఆ అన్నగారెప్పుడో కాలం చేశారు....

రాయలు:— ఆయన కుమారుడు - చిరంజీవి శ్రీరంగరాయలు జీవించే వున్నాడు.

రాణి — అబ్బో, మీకేనా పుత్రుడు లేనిది?

రాయలు: —సృష్టికెప్పుడూ ప్రతి సృష్టి వుండనే వుంటుందిదేవీ! యువరాజుగా శ్రీరంగరాయలు ప్రజా హృదయంలో

సుప్రతిష్ఠుడైన తర్వాత, వేంకటపతిరాయల కింక సంతానం లేదని జనులందరూ రూఢిగా అనుకున్న తర్వాత నీ గర్భం ఫలించడముంది చూచావా! ఏమనాలి దాన్ని? - దాన్ని నేను కేవలం విధి విపర్యయమేనంటాను.

రాణి:— కట్టుకున్న భార్య, కన్న సంతానం తమకు కొరగాకుండా పోవడముంది చూచారా! ఏమనాలి దాన్ని? దాన్ని నేను అజ్ఞానమే నంటాను

రాయలు: — మహారాణీ!

రాణి:— మన్నించండి ప్రభూ! కన్న బిడ్డకు అన్యాయం కలిగే పక్షంలో ఏ తల్లి అయినా యిట్లాగే వ్యవహరిస్తుంది.

రాయలు:— స్వార్థం దగ్గరికి వచ్చేటప్పటికి సదసద్వివేకం నశిస్తుందని చెప్పు, ఒప్పుకుంటాము. మనది కానప్పుడు ఎంతటి అమూల్యమైన వస్తువునైనా పారవేసుకుంటాము. మనదైనప్పుడు వట్టి పనికిమాలిన వస్తువుకైనా నట్టింట స్థానం కల్పిస్తాము. చాలా అనర్థాలకిదే మూల హేతువు. ఇది నువ్వు తెలుసుకోదగిన గొప్ప సత్యం.

రాణి:— ప్రభూ! ఈ మాటల్ని నేను వినలేను విని భరించలేను.

రాయలు — కొన్ని సత్యాలు చేదుగా వుంటాయనడం అందుకే? అయినా అవసరం ఏర్పడింది గనుక చెబుతున్నాను. తల్లిగా నువ్వు నీ కొడుకును గురించి మాత్రం ఆలోచిస్తే చాలదు. ఇమ్మడి వేంకటపతిరాయల పట్టమహిషిగా ఈ రాజ్య శ్రేయస్సును గురించి ఆలోచించడం నీ ధర్మం.

రాణి.— నా కొడుకు రాజైతే మీ రాజ్యానికి శ్రేయస్సు లేదా ప్రభూ?

రాయలు:— ఆ విషయం లోకం కోడై కూయడం లేదా మహారాణి! ఒకటి తులసి మొక్క. ఇంకొకటి గంజాయి

మొక్క. తులసి దళం పూజకు పనికొస్తుంది. ఆరోగ్యానికి ఉపకరిస్తుంది. గంజాయి మనసుకు కైపెక్కిస్తుంది. మనిషిని పశువుగా మారుస్తుంది. దైవపూజకు తులసీ దళాలే ఉపయోగిస్తావో, గంజాయిపత్రే వినియోగిస్తావో....అది....అది...

రాణి:— అది నా కర్మంటారు....

రాయలు:— కాదే! ఆ కర్మ నీకు మాత్రమే పరిమితమైతే నాకు చింతలేదు. అది దేశానికి పీడ కాగూడదనీ, ప్రజలకు అరిష్టంగా పరిణమించ గూడదనీ, నా ఆశ. ఆశయం.

(ప్రవేశం - కంచుకి)

కంచుకి :— ప్రభువుల వారికి శతకోటి వందనాలు. దేవరవారి దర్శనార్థం యాచమ నాయకుల వారు - మండువాలో వేచివున్నారు.

రాయలు:— తక్షణం ప్రవేశపెట్టు.

కంచుకి:—చిత్తం (నిష్క్రమమణ)

రాణి:—ఏదో ముఖ్యమైన రాచకార్యమే అయివుంటుంది. నేనందాకా వెలవు తీసుకోనా ప్రభూ!

రాయలు: మంచిది మహారాణీ!

(మహారాణి లోపలికి వెళ్తుంది. ప్రవేశం - యాచమనాయకుడు)

యాచమ:— కర్ణాటక సామ్రాజ్య పునరుజ్జీవనకారకులు శ్రీవీర వెంకటపతి దేవరాయ ప్రభువులవారికి వెలుగోటి యాచమనాయకుడు అవనతశిరస్కుడై నమస్కరిస్తున్నాడు.

రాయలు:— రండి, రండి, ఉపవిష్టులుకండి.

యాచమ:—విశ్రాంతి సమయంలో ప్రభు దర్శనం కోరినందుకు క్షంతవ్యుణ్ణి. విషయ ప్రాముఖ్యం అట్టిది.

రాయలు:—ఆ విషయం మీరు చెప్పకపోయినా మాకు ఆకళింపే! వైన మేమిటో ఎరుక చేయండి.

యాచమ:— చారుల మూలంగా ఇప్పుడే అందిన వార్త. ఈ శుభ వర్తమానంతో ముమ్ముందుగా తమకు శ్రవణానందం కలగజేయాలన్నది - మీ ఆశ్రితుని కోరిక.

రాయలు:— మా శ్రీరంగరాయల విజయవార్తై వుంటుందని ఊహించాములెండి! ఏదీ, ఆలేఖార్థాలు వినిపించండి.

యాచమ.— చిత్తం. (లేఖాపత్రాన్ని విప్పి) "అభినవ ఆంధ్ర భోజులు, అరిజన భయంకరులు. కర్ణాటక సామ్రాజ్య పునస్థాపనాచార్యులు, శ్రీ వీర వెంకటపతి దేవరాయ మహీపతులవారి దివ్య సముఖానకు ద....ద....దళవాయి శ్రీరంగ.... రాయలు (ఆగిపోతాడు)

రాయలు.— యాచమనాయకుల వారి గొంతుక కేవో అడ్డుపడి నట్టుంది.

యాచమ:—ప్రభువులు మన్నించాలి. శ్రీ రంగ రాయలవారు దళవాయిగా నియమితులైనట్టు ఇంతకుముందెప్పుడూ నేను - విననూలేదు; ఊహించనూ లేదు.

రాయలు:— మీకు తెలియకుండా అలాంటి ఫర్మానా ఒకటి - ఈరాచనగరు నుంచి - వెలువడనూలేదు

యాచమ:— మరి... మరి....

రాయలు:— పరవాలేదు. ప్రస్తుతానికతడు తన అభీష్టం మేరకు దళవాయిగానే ఉండనివ్వండి. ఎవరెవరు ఏ పదవికి పనికొస్తారో నిర్ణయించేది....

యాచమ:— ఎవరు ప్రభూ?

రాయలు:— కాలం, (లేఖవైపు చూపిస్తూ) కొనసాగించండి.

యాచమ:— చిత్తం, "—దళవాయి శ్రీరంగరాయలు సద్వినయ భయభక్తులతో శాయంగల విన్నపం—

తమ ఆనతి మేరకు పదివేలు కాల్బలంతోనూ, మూడు వేల అశ్వబలంతోనూ, అయిదునూర్ల గజబలంతోనూ దండు వెడలివచ్చి మార్గశిర శుద్ధ త్రయోదశి నాటికి జింజి దుర్గాన్ని ముట్టడించినాము. ఉత్తరపు వైపునుంచీ కోటను భేదించడం సుళువుగా వుంటుందని గూఢచారుల మూలంగా గుర్తెంగి అటువైపునుంచీ సేనను మోహరింపజేసినాము. అమావాస్యనాటి మధ్యాహ్నానికి మన సేనలు కోటలో జొరబడి రాజనివాసాన్ని చక్రబంధంలో చుట్టుముట్టుకున్నవి. కోటలో నుంచీ పారిపోయే ప్రయత్నం వమ్ముగావించబడడంవల్ల దుర్గాధిపతి జింజి కృష్ణప్పనాయకుడు చేయునది లేక కాళ్ల బేరానికి సిద్ధపడినాడు. ప్రస్తుతమతడు బందీగా మన వశంలో వున్నాడు. కృష్ణప్పనాయకుడి దుష్టపాలనానికి విసిగి, విరక్తి చెందివున్న ఈ ప్రాంతపు జనులు ఏర్పడిన పరిణామానికి సంతోషిస్తూ, పండుగలు చేసుకొంటున్నారని వింటున్నాము. జింజి దుర్గాధిపతి పట్ల ఎట్లు వ్యవహరించవలెనో తెలిపి, మిగిలిన కర్తవ్యాలను గూడా ఉపదేశించ గోరినాము. సకలం రుద్రయ్యా, ధాకల జగమల్లు, రేచర్ల మల్లుదొర, మాఘుంలింగన్న మున్నగు మన యుద్ధవీరులు ప్రాణాలకు తెగించిపోరాడి, జింజి విజయానికి కారణభూతులైన వివరాలను దేవరవారికి సమక్షంలో మనవి జేయగలవాడను - ఇట్లు, విశ్వసనీయుడు, ప్రేమపాత్రుడు - శ్రీరంగరాయలు''

రాయలు:— సామ్రాజ్యాని కేర్పడిన సంకటం ఒకటి యిలా పరిష్కారమైపోవడంవల్ల మనసు కెంతో ఉల్లాసంగా వుంది. ఇప్పుడిక కృష్ణప్పనాయకునిపైన తీసుకోదగిన చర్య ఏమిటో సూచించండి.

యాచమ:— తమకు మంత్రాంగం చెప్పదగిన వాణ్ణి గాను, అయినా అడిగారు గనుక చెబుతున్నాను. రాజ్యక్షేమానికి హాని తలపెట్టే కుట్రదారులు మనదారిలోని విషకంట కాలు అందులోను జింజి కృష్ణప్పనాయకుడు గుంటనక్క వంటి మాయావి. తోడేలు వంటి క్రూరుడు. గత్యంతరం లేక కాళ్లుపట్టు కున్నా డే గానీ, వీలుదొరికితే జుట్టు పట్టు కోవడమే అతడినైజం. అందువల్ల అతణ్ణి చంద్రగిరి దుర్గానికి తరలించి, యిక్కడి కారాగారంలో వుంచడం మంచిదని - నా అభిప్రాయం.

రాయలు:—కానీ అందులో పొంచివున్న ప్రమాదాన్ని మీరు విస్మరిస్తున్నారు. మహారాణి సోదరుడు గొబ్బూరి జగ్గరాజు..

(యాచమ ఉలికిపడ్డట్టుగా తలపైకెత్తి రాయలవైపు చూస్తాడు)

రాయలు:— అవును. సదరు గొబ్బూరి జగ్గరాజు జింజి కృష్ణప్పకు ఆప్త మిత్రుడు. జగ్గరాజు కిక్కడున్న స్థాన బలం మీకు విదితమే! ఇతడు పక్కలో బల్లెం. పోగా, చాపక్రింద నీరు యింకొకటుంది ...

యాచమ:— అర్థమైంది ప్రభూ! తమరు కార్వేటినగరపాలకుడు సాళ్వనూకరాజును గురించి హెచ్చరిస్తున్నారు ఈ దుష్టత్రయాన్ని అదుపులో పెట్టడమంటే - అది రాజధానిలోని దుర్గపాలకుడు చేయవలసినపని. ప్రస్తుత దుర్గపాలకుడు అంకుశం వీరరాయలు వీరుడే స్వామిభక్తుడే. కానీ మిక్కిలి వృద్ధుడు. అందువల్ల అతడి స్థానంలో చిత్తశుద్ధి, కర్తవ్యనిష్ఠ, విశుద్ధ ప్రవర్తన, నిరంతర జాగరూకత కలిగిన వ్యక్తిని నియమించడం.... శాంతి భద్రతల దృష్ట్యా....

రాయలు:— మీరు కోరుకుంటున్న అర్హతలన్నీ శ్రీరంగరాయలలో వున్నట్టయితే, దుర్గపాలకత్వం అతనికప్పగించ

వచ్చును గదా!

యాచమ:— చిత్తం. ప్రభువుల మనసులోని ఊహా, నా మనసులోని యింగితం - రెండూ ఒక్కటే

రాయలు:— మంచిది. జింజి రక్షణకు తగు ఏర్పాట్లు గావించి, తక్షణమే బయలుదేరి రావలసిందిగా శ్రీరంగరాయలకు వ్రాయించండి. రేపటి ఉదయమే వేగర్లను.

(విలక్షణంగా గంట మ్రోగుతుంది)

యాచమ:— అవాంతరపు గంట మ్రోగింది ప్రభూ! అనుమతి లేకుండా ఎవరో లోపలికొస్తున్నారు

(ప్రవేశం - గొబ్బూరు జగ్గరాజు)

జగ్గ:— అలా నివ్వెరపోయి చూస్తారే మండీ, యాచమ నాయకులవారూ! అనుజ్ఞ లేకుండా లోపలికొచ్చే చొరవ మరెవరికుంటుంది? రాజమాన్య, రాజ పూజిత, మహా మండలేశ్వర గొబ్బూరి జగ్గరాయలకే వుంటుంది. (రాయలవారి వైపు తిరిగి) బావగారికి నమస్కారం! మరొకరికి, మరొకరికి గాకపోయినా తమకు సంజాయిషీ చెప్పుకోవడం నా ధర్మం! అత్యవసరంగా అక్కగారితో మాట్లాడవలసిన పనిబడింది. రక్త బంధువుల నడుమ కావలి బంట్రోతుల రాయబారమంటే నాకయిష్టం. అందుకని చక్కాలోపలికి వచ్చేశాను.

రాయలు:— అంత అత్యవసరమైన పనేమిటో?

జగ్గ:— తమకింకా తెలియదా? చిరంజీవి పుట్టినరోజు పండుగండీ బావగారూ!

రాయలు:— చిరంజీవి పుట్టిన రోజా! అదెప్పుడూ?

జగ్గ:— అన్యాయం. బిడ్డ పుట్టినరోజు కన్న తండ్రికే గుర్తుండకపోవడం చాలా అన్యాయం. అయినా పరవాలేదు. తల్లి పుట్టినిల్లు మేనమామకు తెలియకపోతుందా - అని

సామెతవుంది గదండీ! తల్లి పుట్టినిల్లే తెలిసిన మేనమామకు మేనల్లుడి జాతకం మాత్రం తెలియకపోతుందా? ఎచ్చేద్వాదశినాడు - తిరుపతి కొండపైన - స్వామి సన్నిధిలో - యువరాజు చిక్కరాయలవారి ఇరవైఒకటో జన్మదినోత్సవం - వైభవోపేతంగా జరుపులాగున....

రాయలు:— మరైతే మనం జింజి విజయోత్సవంగూడా అప్పుడే జరపొచ్చుగదా! యాచమనాయకు లేమంటారు?

జగ్గ:— (దెబ్బతిన్నట్టుగా) జింజి విజయోత్సవమా! అదేమిటి?

యాచమ:— తిరుగుబాటుకు పూనుకున్న జింజి దుర్గాధిపతికి ఈలోగా తగినశాస్తి జరిగి తీరుతుందని ప్రభువుల నమ్మకం. అందుకని జింజి విజయోత్సవాన్ని గూడా చిక్కరాయల జన్మదినోత్సవంతో జతచేసి జరుపుకోవడం సముచితంగా వుంటుందని ఆయన భావిస్తున్నారు.

జగ్గ.— ఏం మాట! అలాంటిదేమీ తలపెట్టకండి. పిల్లకాకిని వుండేలుపైకి పంపడమే పెద్ద పొరపాటు. పాపం, శ్రీరంగడి దురవస్థను తలుచుకొంటే నాకు జాలిగా వుంది. ఓడిపోయిన ముఖంతో అతడు కర్నాటకంలో అడుగు పెట్టలేదు. జింజి ప్రాంతాల్లో బతికి బట్టగట్టనూ లేదు. ఏ లగ్నాన జన్మించినారో గానీ తిరుమలరాయల వారి బిడ్డలిద్దరూ నిష్ప్రయోజకత్వంలో తమకు తామే సాటి అనిపించుకున్నారు. పెద్దవాడు అంతఃపుర విద్రోహానికి పాల్పడి దేశాలపాలైనాడా, ఇప్పుడు శ్రీరంగనికీ అదే గతి దాపురించినట్టుంది. ఏం చేద్దాం, అంతా ప్రారబ్దం!

రాయలు:— ప్రారబ్ధాలను నిర్ణయించే అపరబ్రహ్మ జగ్గరాయలే అయితే - జింజి కృష్ణప్ప నాయకుడి ప్రారబ్దం ఎలా

వుంటుందో - మీరు గ్రహించారా యాచమ నాయకు లవారూ!

యాచమ:— గ్రహించాను ప్రభూ! కానీ ఈయనకు ఆశాభంగం కలిగించవలసివచ్చినందుకు నాకెంతో చింతగా వుంది.

జగ్గ:— (అయోమయంగా) మీ గూఢ భాషలు నాకేమీ బోధ పడడంలేదు.

రాయలు:— బోధ పడడానికొక ఉపకరణంవుంది. ఇదిగో - ఈ అద్దంలో నీ ముఖం చూచుకోవయ్యా జగ్గరాయా! (తన చేతవున్న ఉత్తరాన్ని జగ్గరాయలకు అందిస్తాడు).

జగ్గ:— (లేఖలోవున్న విషయమేమిటో చూచాయగా అర్థమైంది. కానీ విప్పిచదివే తెగింపులేదు, వుక్రోషంతో రాయల వారిని, యాచమనాయకుణ్ణి మిర్రిమిర్రి చూస్తున్నాడు) యాచమ.

రాయలు:— (జగ్గరాయల ఉనికిని పట్టించుకోకుండా) నాయకులవారూ! మీరు తదుపరి కార్యాలు గమనించండి. తిరుపతి కొండపైన గల స్థానాపతికి కబురుపంపి స్వామి కల్యాణోత్సవానికి ఏర్పాటు చేయించండి. అట్లాగే పండితులకు సన్మానాలు, యాత్రికులకు అన్నదానాలు, సద్బ్రాహ్మణులకు సంభావనలు, అన్ని తీర్థాలలోను అభిషేకాలు,.... తీర్థమంటే, జ్ఞప్తికి వచ్చింది. జాబాలి తీర్థంలో ఒక సిద్ధుడెవరో వేంచేసి వున్నాడట. ఆవార్త మీ చెవిదాక వచ్చిందా?

యాచమ:— విన్నాను ప్రభూ! సిద్ధులవారికి ఆగత, అనాగత వర్తమానాలన్నీ కరతలామలకాలట! ఒంటరిగా వెళ్లి ఆయన ఎదుట నిలబడితే చాలు. సర్వ సందేహాలూ నివారిస్తాడట!

(ప్రవేశం - కంచుకి)

కంచుకి:— ప్రభువులకు ప్రణామాలు! పురాణ శ్రవణానికి వేళయింది. సర్వజ్ఞ సూరిగారు తమరాకకోసం వేచివున్నారు.

రాయలు:— (యాచమనాయకుడి వైపు చూస్తాడు)

యాచమ:— వెళ్దామా ప్రభూ!

రాయలు:— దయ చేయండి, దయచేయండి.

[రాయలవారు, యాచమనాయకుడు, కంచుకి నిష్క్రమిస్తారు. జగ్గరాజు తటపటాయిస్తూ లేఖను విప్పిచదవడానికి ప్రారంభిస్తాడు. అతడి ముఖంలో ఆగ్రహం, అసహనం పరవళ్లు త్రొక్కుతున్నాయి. కళ్ల ఎదుట ప్రపంచం గిర్రున తిరిగిపోతున్నట్టుంది. చేతివ్రేళ్ల మధ్యలేఖ పరిపరి విధాల నలిగిపోతూవుంది. గాలికికొట్టుకుపోయినట్టుగా వెళ్లి మూలగావున్న ఓ ఆసనం పైన కూలబడిపోతాడు. ఆ పరిసరాలంత స్తబ్దంగా వున్నందుకు ఆశ్చర్యపడి పోతూ చిక్కరాయలు, రంగభట్టు మెల్లగా రంగంపైకి ప్రవేశిస్తారు]

చిక్క:— మిత్రమా, రంగభట్టూ!

రంగ:— యువరాజా, చిక్కరాయా!

చిక్క:— అమ్మాదేవిగారి మందిరం యింత ప్రశాంతంగా వుందేమిరా నాయనా?

రంగ:— హరి, హరీ! విననొల్ల, విననొల్ల. అదేం మాట యువరాజా?

చిక్క:— ఇప్పుడేమయిందిరా నెచ్చెలికాడా?

రంగ:— మేళతాళాలులేని పెండ్లిలాగున, పద్మాలులేని సరస్సులాగున, వీరాంగనలులేని నగరంలాగున – అలంకారం లేని వాక్యానికి సొబగులేదు. 'మందిరం ప్రశాంతంగా వుంది' అనరాదు. ఆ ప్రశాంతి ఎలావుంది? అదెముఖ్యం.

దొంగలుపడిన ఇంటిలా ప్రశాంతంగావుంది - అనాలి
దేవుడులేని గుడిలా ప్రశాంతంగావుంది - అనాలి.

చిక్క:— మిత్రమా, రంగభట్టూ!

భట్టు:— యువరాజా, చిక్కరాయా!

చిక్క:— మాట్లాడడం మావంతు - ఉపమానాలు జోడించడం నీ వంతు

భట్టు:— చిత్తం, చిత్తం.

చిక్క:— రంగభట్టూ!

భట్టు:— యువరాజా!

చిక్క:— మందిరంలో ముసలి నక్కల మంతనాలు లేవేమిరా?

భట్టు:— ఎండ్రకాయల కోసం బయటకు వెళ్లి వుంటాయి ప్రభూ!

చిక్క:— శహబాష్! చక్కగా అతికినట్టు చెప్పేశావోయ్!

భట్టు;— ఉపమానం యువరాజా! ముక్కుకు ముక్కెర తొడిగినంత చక్కగా - అనాలి.

చిక్క:— (అటూ ఇటూ చూస్తుండగా తటాలున జగ్గరాయలు కనిపిస్తాడు) ఇదేమిటి? మామాజీ. నువ్విక్కడున్నావా? అసలింతకూ జీవించే వున్నావా? విగ్రహమైనావా? భట్టూ! నరుడు జీవించి వున్నందుకు నిదర్శన మేమిట్రా? కనురెప్పలు కదులుతూ వుండవలెనుకదూ.

జగ్గ:— (ఉన్నట్టుండి) చిక్కరాయా!

చిక్క: — (ఉలికి పడ్డట్టుగా) మాట్లాడినావా మామయ్యా!

జగ్గ:— హాస్యాలకిది సమయంకాదు.

చిక్క — ఎందుకనో?

జగ్గ:— ఇంతకాలంగా నేను కథ నడుపుతూ వచ్చినాను, ఇప్పుడు కథ అడ్డం తిరిగి నన్ను నడిపే పరిస్థితి పొడచూపింది.

చిక్క:— మామాజీ! ఇప్పుడు నీకేమైనా కష్ట మొచ్చిందా.

జగ్గ:— నా కష్టాలేవీ నన్ను గురించి గాదు. నిన్ను గురించే.
చిక్క:— నాకేం మామయ్యా! అమోఘంగా వున్నానే. స్నానాలు, పానాలు; వినోదాలు, విహారాలు అన్నీ సవ్యంగా జరిగిపోతున్నాయి.
జగ్గ.— భావి సామ్రాజ్యాధిపతికి అవన్నీ ముఖ్యంగావు నాయనా!
చిక్క:— మామాజీ! భావి సామ్రాజ్యాధిపతి కేది ముఖ్యమో నాకు తెలియదా?
భట్టు:— ఎందుకు తెలియదు? రాజనరేంద్రుని ఆస్థానంలో నన్నయ్యగారి విధంగా, మనుమసిద్ధి కొలువులో తిక్కన సోమయాజి మాడ్కిగా, కృష్ణరాయల పేరోలగంలో అల్లసాని పెద్దనామాత్యుల చందంగా....
చిక్క:— ఇదిగో!— మన ఆస్థాన కవి!
భట్టు:— (తనను తాను పరిచయం కావించుకున్నట్టు) లింగనామాత్య పౌత్రుడు, లక్షణాచార్య పుత్రుడు, కౌండిన్యస గోత్రుడు, ఆపస్తంభ సూత్రుడు, ఆర్వేలనియోగి వంశ పయఃపారావారరాకాసుధాకరుడు, కవికిశోర బిరుదాంకితుడు యువరాజ చిక్కదేవరాయ ప్రాణ మిత్రుడు, జివ్వాది రంగభట్టారకుడు....
జగ్గ:— కూత ఘనమే!
చిక్క— వట్టి ఘనమా! ఘనాఘనం. మిత్రమా, రంగభట్టూ! ఏదీ, మహామండలేశ్వర గొబ్బూరి జగ్గరాయలవారి పైన ఒక ఆశువు....
భట్టు:— చిత్తం. ఆధరించండి

కట్టించినాడవు కామవరమ్మున
 రంగసానికి గొప్ప రంగుమేడ
చేయించినాడవు రాయప్ప సంద్రాన

ముసుగునాగమ్మకు పసిడిదండ
ఇప్పించినాడవు పసుగుపాడులో
జాలరత్నాంగికి పంటభూమి
జరిపించినాడవు వరదాగ్రహారాన
సురటి మీనాక్షికి....

(విషయం స్ఫురించనివాడిలా మళ్ళీ మళ్ళీ చదువుతాడు.)

చిక్క:— ఏమిజరిపించినాడోయీ మిత్రమా! చెప్పరా నాయనా చంపక!

భట్టు:— జరిపించినాడవు వరదాగ్రహారాన
సురటి మీనాక్షికి - శోభనమ్ము.

(చిక్కరాయలు ఆనంద విహ్వాలుడై పోయి వారెవా శహబాష్, భళి భళీ అంటూ భట్టును కౌగిలించుకుని 'సురటి మీనాక్షికి శోభనమ్ము' అంటూ ఉక్కిరి బిక్కిరి చేసేస్తాడు)

భట్టు:— యువరాజా! ఊపిరాడుటలేదు. ఇంకా ఒక ఎత్తు గీతం కొరతగా వుండిపోయింది.

చిక్క:—(కౌగిలిసడలించి) చెప్పిముగించు.

భట్టు:— వారజనపోషకుండవై వన్నెకెక్కి
కామశాస్త్రానికే కొత్త కళలు దెచ్చి
మేటురసికోత్తముండవై మించినావు
చాంపు విటరాయ! గొబ్బూరి జగ్గరాయ!

చిక్క'— విన్నావా మామయ్యా! అక్షరలక్ష లివ్వదగిన పద్యం అవలీలగా.... అలవోకగా.... అశువుగా....

జగ్గ — చిక్కరాయా! ఇటువంటి చచ్చుపద్యాలకన్నింటికీ అక్షర లక్షలిస్తే యింక నీ రాజ్యం నిలుస్తుందా నాయనా! (కోపంగా) ఈకవికాకిని ఆవలికి వెళ్ళమను, మనం కొన్ని విషయాలు... అంతరంగికంగా....

చిక్క:— కానీ మామాజీ! రంగభట్టారకుడు చొచ్చుకుని రావ డానికి వీల్లేని అంతరంగిక మేదీ మాకు లేదే! ఎందుకంటే -

భట్టు:— నన్ను చెప్పనివ్వండి యువరాజా!

చిక్కరాయలు తనువైన, చిక్కియున్న
ప్రాణ మద్దానిలోన ఈ రంగభట్టు
బొందెలేవేరు, భావాల చంద మొక టె
జంకు గొంకులు మానుమా, జగ్గరాయ!

జగ్గ:— సరే. ఒకమూల కూలబడమని చెప్పు. అరవకుండా వుండ డం కోసం గట్టిగా ఒక పనిగూడా పెట్టు.

చిక్క:— అట్లాగే మామయ్యా! - మిత్రమా రంగభట్టూ!

భట్టు:— యువరాజా, చిక్కరాయా!

చిక్క:— కుండ, దండ - జాలు, డాలు - బొమ్మ, గుమ్మ - వీణ, జాణ - వేణి రాణి.... యిలా కలకండ ముక్కల వంటి పదాలు ఏరికోరి ఎన్నికచేసి....

భట్టు:— ఎన్నిక చేసి....

చిక్క:— ఆపదాలను పోహళించి....

భట్టు:— పోహళించి....

చిక్క:— విల్లెక్కు పెట్టి, నారిబిగించి, చెవిదాకా లాగి మన్మ థుడు పూలబాణం ఒకటి వదిలినట్టుగా.... ఒక పద్యం -

భట్టు:— చిత్తం, ఎవరిపైనో్న వెలవిచ్చినారు కాదు.

చిక్క:— ఓరి పిచ్చిసన్నాసీ! ఇంకా ఎవరిపైన అని అడుగుతు న్నావా! మిటాయి పొట్లం యింటనే వుండగా ముచ్చ నష్టపు వంటకాలకోసం వాడ వాడ తిరిగి వేసారి పోయారా! మరిచిపో, కొత్త గ్రంథానికి శ్రీకారం చుట్టు.

భట్టు:— అదే, అదే, అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొన ర్వం బూనిన ఏతద్ శృంగార ప్రబంధానికి కథానాయిక

ఎవరు అని అడుగుతున్నాను, (నర్మగర్భంగా) నాకు తెలియక కాదు ప్రభూ! కానీ నోరారా, చవులూరా మీరు చెబితే, విందామని....

చిక్క:— కొంగు బంగారంలా చెంగటనే వున్నదీ, అరచేతి పండులా అందుబాటుకు లోనైనదీ, అమృతరసాయనంలా ఆద్యంతమూ మధురమైనదీ - దేవదాసి రంగనాయకిరా చెలికాడా

జగ్గ:— (తలపైన పిడుగు పడినట్టుగా ఎగిరిపడి) చిక్కరాయా నీకు మతిపోయిందా?

చిక్క — నెమ్మది నెమ్మది. శాంతం, శాంతం! పదిలంగా కూచో మామయ్యా! దేవదాసి రంగనాయకి దేవుడి బిడ్డలందరికీ ఉమ్మడిసొత్తు. ఎవరో నీ సొమ్ము దోచుకుపోయినట్టుగా తబ్బిబ్బు పడిపోతా వెందుకూ?

జగ్గ:— ( ఆక్రోశిస్తున్నట్టుగా చిక్కరాయల చేతులుపట్టుకుని ) నాయనా, చిక్కరాయా! నువ్వు సాని కొంపల్లోనే కాపురంపెట్టు. నేను వద్దనను. కానీ దేవదాసి రంగనాయకి మాట మాత్రం ఎత్తొద్దు.

చిక్క:— మామయ్యా! ఏ పండైనా తిను. తియ్య మామిడి పండుమాత్రం తినొద్దు - అనడంలో అర్థముందా?

జగ్గ:— (హతాశుడైనట్టుగా) చిక్కరాయా! దేవదాసి నీకంటె ఎంతో పెద్దదిరా! వయసులో అంతరాలనైనా పాటించరా!

చిక్క:— చెరుకు ముదిరిన కొద్దీ తీపి హెచ్చుతుందని తెలియదా మామయ్యా?

జగ్గ.— (నిస్సహాయంగా గొంతుచించుకుంటూ) ఆమె మహా పతివ్రత రా!

చిక్క:—(వికటంగా నవ్వుతూ) పతివ్రత! పతి.... వ్రత. పతేలేని

రంగనాయకి పతివ్రత ఎలా అయింది మామయ్యా? ఆలే లేకపోతే చూలొస్తుందా?

జగ్గ:— (తల గట్టిగా పట్టుకుంటూ) నీకెలా చెప్పను, ఏం చెయ్యను ఏ గంగలో దూకనురా నాయనా?

చిక్క:— మిత్రమా, రంగభట్టూ! ఇప్పుడు మామాజీ కొచ్చిన కష్టమేమిటో బోధపడటంలేదురా!

భట్టు:— (పద్యం అల్లుతున్నాడు, వినిపించుకోడు)

చిక్క:— అయ్యో. పాపం! ఒళ్లంతా చెమటలు పోసేస్తున్నాయిరా!

భట్టు: — (తన ధోరణిలో నుంచీ) యువరాజా! పద్యం సిద్ధమైపోయింది.

చిక్క:— (భట్టు దాపున వున్న ఆసనం పైన కూచుంటూ) వడ్డించు, వడ్డించు.

[భట్టు ఒక్కొక్క గీతే రాగయుక్తంగా చెప్పి ఆపుతాడు. మాటల్ని నమిలి చప్పరించినంత ఆప్యాయంగా ఆగీతలోని పదాలను విరిచి చెబుతూ చిక్కరాయలు తన్మయత్వంలో తలమునకలై పోతున్నాడు.)

భట్టు }
చిక్క }

పొగసు బంగరుకుండ - సొంపైన పూదండ
మధువుల జాలు - మన్మథుని డాలు
బచ్చన బొమ్మ - సెబాసు ముద్దులగుమ్మ
వలపుల సరణి - జవాది బరణి
రతి చేతిలో వీణ - రంగైన నెరజాణ
అలివేణి - సింగారములకు రాణి
మురిపంబులకుదీవి - మరుమల్లె నెత్తావి
రసరాజధాని - శ్రీరంగసాని

(చిత్రహింసకు గురవుతున్నట్టుగా మెలికలు తిరిగిపోతూ అంతవరకు ఎట్లాగో వింటూ వచ్చిన జగ్గరాయలు, ఓపిక

పూర్తిగా హరించుకపోవడంతో అగ్ని పర్వతంలా ప్రేలి పోతాడు.)

జగ్గ:— ఓరి అప్రాచ్యుడా! కారుకూతలు కూస్తావేమిట్రా భ్రష్టుడా! (నుగ్గునూచం చేసెయ్యాలన్నంత కోపంతో భట్టు పైకి దుముకుతాడు)

భట్టు:— (బెదరిపోతూ) యువరాజా!

చిక్క:— అభయం, అభయం!.... భానిసామ్రాజ్య ఆస్థానకవి పైన అనవసరంగా దుర్భాషలు కురిపిస్తున్నావు మామయ్యా!

జగ్గ — ఛీ ఛీ. ఈ అయోగ్యుడా ఆస్థానకవి? కాకి కోయిలవుతుందా? కాదు. (తటాలున నీరసించిపోయినట్టు) కాకి కోయిలకాదు.

చిక్క:— ఎందుకుకాదు మామయ్యా? తిమ్మిని బమ్మిగా, బమ్మిని తిమ్మిగా మార్చగల సమర్థుడవు, నువ్వు తలుచుకుంటే కానిదేముంది?

జగ్గ;— నేనూ అట్లాగే అనుకున్నాను. (దృఢ నిశ్చయాన్ని ధ్వనిస్తూ) ఇప్పుడైనా మించిపోయిందిలేదు బాటలో యింతదూరం పయనించి వచ్చేశాను. ఇప్పుడిక యిక్కడి నుంచీ తిరోగమించే ప్రసక్తే లేదు. చిక్కరాయా! ఆరు నూరైనా, నూరు ఆరైనా నిన్ను నేను సింహాసనంపైన అధిష్ఠింపజేస్తాను. కానీ, ఒక్క షరతు, నువ్వు దేవదాసి మాట మాత్రం తలపెట్టడానికి వీల్లేదు. ఆమె నీడనైనా త్రొక్కరాదు.

భట్టు:— (ఏడుపు మొగం పెట్టి) మరైతే యువరాజా! నా యౌవనప్రాంబూలానిన శృంగార ప్రబంధం గతి?

జగ్గ — ఓరి దౌర్భాగ్యుడా! ఆ శృంగార ప్రబంధంతో కలిపి నిన్ను కూడా సజీవ దహనం చేస్తాను.

చిక్క:— కానీ పంచాంగాలు చించేస్తే నక్షత్రాలు లేకుండా పోతాయా మామయ్యా?

జగ్గ: - చిక్కరాయా! రాజ్యాంగంలో వస్తున్న పరిణామాలను గురించి తెలిస్తే నువ్వు తుచ్ఛ సుఖాల కోసం అర్రులు సాచవు. మంచికైనా, చెడుకైనా నాకెప్పుడూ వెన్నుదన్నుగా నిలిచే జింజి కృష్ణప్పనాయకుడు నిన్నగాక మొన్న శ్రీరంగనికి పాదాక్రాంతుడైనాడు, చాలని దానికి చంద్రగిరి దుర్గపాలకత్వం గూడా వాడిపాలేగా వచ్చునని ఒక ఊహ కోటలో వ్యాపిస్తూవుంది. అంతపనీ జరిగితే వాడు మనకు బలమైన ప్రత్యర్థిగా నిలుస్తాడు.

చిక్క:— ఏం మాటలే మామయ్యా! తనకు రాజ్యకాంక్ష లేదని అతడు నాతోనే ఎన్నో సార్లన్నాడు,

(ద్వారం దగ్గర మహారాణి కనిపిస్తుంది. ఆమె ఆగమనాన్ని మిగిలిన వాళ్లు గమనించరు.)

జగ్గ:— చిక్కరాయా! వినవచ్చిన ప్రతి మాటా నిజమనుకో గూడదు, అదే రాజనీతి.

చిక్క:— మామయ్యా! నేను చెబుతున్నాను. నీకటువంటి భయ సందేహాలేవీవద్దు. ఈ రాజ్యం మనది గద్దె మనది. ఎటొచ్చీ ఒక్కటే అడ్డంకి.... (ఏమిటది అన్నట్టు ఉత్కంఠగా జగ్గరాయలు చిక్కరాయలవైపు చూస్తాడు. ఒక క్షణం ఆగి చిక్కరాయలు పూర్తి చేస్తాడు) - ముసలిరాజు!

( కోపావేశంతో మహారాణి తటాలున ముందుకు వచ్చి 'చిక్కరాయా' అంటూ సాచి ఒక లెంపకాయ యిస్తుంది. వారిస్తున్నట్టుగా జగ్గరాయలు 'అక్కయ్యా' అంటూ లేచి నిలబడతాడు )

( తెర )

# 2

[తిరుమలపైన దేవదాసి రంగనాయకి పటకుటీరం. కుటీరం పరమ రమణీయంగా అలంకరించబడివుంది. పూలతోరణాలు వేలాడుతున్నాయి. ద్వారం దగ్గరి నుంచీ రంగం మధ్యలోవున్న సుఖాసనం దాకా దారిని నిర్దేశిస్తూ పువ్వులు పరుస్తూవుంది రంగనాయకి - స్వగతంలా తనకు తానే పాడుకుంటూ]

రంగ: - పూజకు వేళాయెరా!
నా సామీ!
పొలతి నీకై వేచెరా!

పండంటి వెన్నెలలు- అడవి పాలాయెరా!
నిండు జీవిత శోభ - దండగై పోయెరా!
ఇకనైన కరుణించరా!
నా సామి!
ఒక సారి రావేమిరా! — ॥పూజక॥

ఎల్లకాలమ్మిచట - ఉండిపోమ్మనను రా
పలుకోమని నిన్ను - అర్థించబోనురా
పదము మోపిన చాలురా!
నా సామి!
పలుకు పలికిన చాలురా!

[పాట పూర్తయ్యేసరికి అడుగుల చప్పుడు వినవచ్చినట్టు రంగనాయకి వెనుదిరిగి చూస్తుంది. గుమ్మానికీవల రంగభట్టు నిల

బడివున్నాడు. అతని రాక రంగనాయకి ఊహించింది గాదు. అందుచేత తడబడినట్టుగా పలకరిస్తుంది]

రంగ:— ఎవరు?

భట్టు:— (తనను తానే పరిచయం చేసుకుంటున్నాడు) యువ రాజు శ్రీ చిక్కదేవరాయ ప్రాణ సఖుడు, భావి కర్ణాటక సామ్రాజ్య ఆస్థాన కవీంద్రుడు జవ్వాది రంగ భట్టారకుడు—

రంగ:— మంచిది నాయనా! పోల్చుకొన్నానులే! ఎప్పుడైనా సభలో చూచానేమో! అంతకుమించి పరిచయం వున్నట్టు లేదు.

భట్టు:— దేనికైనా సందర్భం రావలెనుగదా! మబ్బు లెక్కితేనే మెరపులు, మెరపులు మెరిస్తేనే ఉరుములు, ఆ చొప్పున అవసరాలేర్పడితేనే పరిచయాలు.

రంగ:— అట్లాగా! ఏదో కార్యార్థం వచ్చినట్టున్నావు, అవునా బాబూ?

భట్టు:— సెలవిస్తాములే! చల్లకొచ్చి ముంత దాచుకుంటామా? అసలు కారణం తర్వాత! అంతకు ముందుగా చెప్పవలసిన అత్యవసరకారణం - నీ పాట. అది సూదంటురాయిలా మమ్మల్ని యిక్కడికి లాగి తెచ్చింది.

రంగ:— ఇంతటి ప్రమాదం వాటిల్లుతుందని తెలిస్తే పాడేదాన్ని గాను. అది నా కొరకు పాడుకున్న పాట.

భట్టు:— తన పాటను గురించి కోయిల్ల గూడా ఆమాట చెప్పుకోవచ్చు.

రంగ:— (ఏదో చెప్పదలచుకున్నట్టుగా భట్టు వైపు నిశితంగా చూస్తుంది.)

భట్టు:— అపార్థం చేసుకోవద్దు. కోయిలతో పోలిక చెప్పడం

అన్యాయమే! ఎందుకంటావా రంగనాయకీ! కోయిల గొంతు మాత్రమే తీపి.

రంగ:— ఎట్లాగైనా కవివి గదా! భావగర్భితంగా మాట్లాడుతున్నావా నాయనా?

భట్టు:— అనుమతిస్తే తేటతెల్లంగా గూడా చెప్పగలను, వీనులకు మాత్రం విందు చేకూరితే చాలునా రంగనాయకీ! కన్నులకు సైతం విందు సమకూరవద్దా? అబ్బో, అది గూడా ఒనగూడింది. (అలంకృతమైన కుటీరాన్ని చుసూ వచ్చి, చిట్ట చివర రంగనాయకి పైన చూపు నిలిపి) మృష్టాన్నం వడ్డించిన విస్తరివలె తృప్తిగా, అంచులదాకా నింపిన మధుపాత్రవలె నిండుగా.... (గింజుకుంటూ)మతి పోయింది. మూడో ఉపమానం స్ఫురించడంలేదు.

రంగ:— నాయనా రంగభట్టూ! నీ కట్టే మతి స్తిమితం లేదని నేనప్పుడే గ్రహించాను. వచ్చిన కారణ మేమిటో తెలియజెప్పు. వీలయినంత తొందరగా నువ్వు సెలవు పుచ్చుకోవడం ఉభయత్రా మనకు మంచిది!

భట్టు:— కానీ నేను వచ్చిన కారణమేమిటో తెలిస్తే నువ్వు వసంతుణ్ణి చూచిన వనలక్ష్మిలా పులకిస్తావు. ఆషాఢ మేఘాన్ని కనుగొన్న మయూరంలా నృత్యం చేస్తావు. చందమామను వీక్షించిన సాగరంలా ఉప్పొంగి పోతావు. రంగనాయకీ! ఆనంద సందేశం మోసి తెచ్చినవాణ్ణి. రాయబారిని కించపరచడం ధర్మంకాదు

రంగ:— సందేశమా! ఏమిటయ్యా అది?

భట్టు:— ఇందాకా అసలుకారణం అన్నానే, అదేయిది! వలజేడు వంటి వలపుకాడు పంపిన ప్రణయసందేశం. వింటావా రంగనాయకీ!

ఏనాడు నిన్నువే నీక్షించి తినోగాని
ఊరుకే కరువాయె కుందరదన!

ఏముహూర్తాన నిన్ను వీక్షించితినో గాని
అన్నహిత వడుగంటె హంసయాన!
ఏక్షణమ్మున నిన్ను ఈక్షించితినో గాని
నిముసమే యుగమాయె నీరజాక్షి!
ఏ వేళలో నిన్ను ఈక్షించితినో గాని
విరహమే బ్రతుకాయె తరుణి మిన్న!



కాయజుని వేడి తూపుల గాడ్పువలన
మదవతీ! నా మనస్సున మంట లెగసె
ఇంక తాళంగ జాల! నన్నేలుకోవె!
సురత సౌఖ్యాలఁదేల్పవే సుందరాంగి!

రంగ:— ఎక్కడో, ఏ క్షుద్ర ప్రబంధంలోనో విన్నట్టుంది, ఎక్కడిది నాయనా ఈ పద్యం?



భట్టు:— పద్యమెక్కడిదన్నది బొత్తిగా అప్రస్తుతం, అది సందర్భోచితంగా వుందా, లేదా అన్నది ప్రశ్న!

రంగ:— ఘోరున పడ్చినట్టుంది.



భట్టు:— (వుక్రోషం కలిసిన చిరుకోపంతో) రంగనాయకీ! నీ వాక్పారుష్యం నీకే చేటు తెస్తుంది జాగ్రత్త! నిన్ను మనోనాయికగా కోరుకుంటున్నవాడు సామాన్యుడు కాదు. ఎవడైతే ఆరవీటి వంశమనే క్షీరసాగరంలో రాకా చంద్రుడి మాదిరిగా ప్రభవించినాడో, ఎవడైతే మహారాణి బయ్యామదేవి గర్భశుక్తి ముక్తాఫలమో, ఎవడైతే చంద్రగిరి మహారాజ్య సింహాసనానికి తిరుగులేని వారసుడో ఆతడు శ్రీ శ్రీ శ్రీ.... (ద్వారం వైపు చూస్తూ) అదిగో, మాటలోనే విచ్చేశారు.

(చిక్కరాయలు ఠీవిగా ప్రవేశించి ద్వారానికీవల దర్పంగా నిలబడిపోతాడు. చిక్కరాయలు ప్రవేశించ

గానే రంగభట్టు అవనత శిరస్కుడై ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్న వాడిలా నిలబడతాడు )

చిక్క:— మిత్రమా, రంగభట్టూ!

భట్టు: – చిత్తం యువరాజా! (ద్వారంలోనుంచి బయటికి తప్పుకుంటూ) భూమిక సిద్ధమైంది.

(ఏం చెప్పాలో, ఏంచెయ్యాలో తోచక రంగనాయకి నివ్వెర పడిపోయి తదేక దృష్టితో చిక్కరాయలు వైపు చూస్తోంది.)

చిక్క:— అలా నిర్ఘాంతపడిపోయి చూస్తావేమి రంగనాయకీ! ఓహో, నీకండ్లను నీవే నమ్మలేకున్నావేమో! కంటి పైన రెప్పవేయకుండా నువ్విట్లా చూస్తూవుంటే. ఏ ప్రకారంగా వున్నావో తెలుసా? చీర సింగారించి, కంచు కం తొడిగిన అపరంజి బొమ్మలా వున్నావు....

( రంగనాయకిలో చలనంలేదు )

చిక్క:— (కొంత సేపు వేచి చూచి మళ్ళీ మొదలు పెడతాడు) ఇట్లా ఎంతసేపైనా ఆశ్చర్యాన్ని భజించడమే అయితే, యిక అనునయాలెప్పుడు, ఆహ్లాదాలెప్పుడు? నయగారా లెప్పుడు, నర్మభాషణా లెప్పుడు? మాకు తెలుసు రంగ నాయకీ! నీకు విస్మయంగా నేవుంటుంది. చంద్రగిరి మహీ మండలానికి నేటి వారసుడు, రేపటి అధిపతీ. అభినవ మన్మథుడు, అపరజయంతుడూ అయిన (శ్రీ) (శ్రీ) చిక్క దేవరాయ భూపతి నా పైన మరులుగొని, చక్కా నా యిక్కకే విచ్చేసి, నా ఎట్టయెదుట నిలబడినాడా? ఇది కలా, నిజమా? అన్న విభ్రమానికి నువ్వులోనై వుండ వచ్చు. కానీ ఏం చెయ్యను చెప్పు. నీ సోయగం అటు వంటిది. నీ తారుణ్యం అటువంటిది. నీ హాయలు అటు వంటిది.

రంగ — యువరాజా! మీ తల్లి మహారాణి బయ్యామదేవి కన్నా నేనందంగా వున్నానా?

చిక్క:— ఛీఛీ. ఇప్పుడా మె|్రసక్తి ఎందుకు?

రంగ — ఎందుకంటే యువరాజా! ఇరువదేండ్లకు మునుపు కోటలో మీ తల్లి, పేటలో నేను యించుమించు ఒకే సమయంలో పు|్రతవతులమైవాము. పుట్టిన బిడ్డ పొత్తిళ్లలోకి రాకనే! చనిపోవడం నా దురదృష్టం, కోటలో మీరు పసిపాపగా దోగాడుతూవుంటే, నా బిడ్డ |్రబతికుంటే యిలా దోగాడేవాడుగదా అనుకునేదాన్ని! మీరు బుడిబుడి నడకలు నడుస్తుంటే నా బిడ్డ |్రబతికుంటే, యిలా నడిచేవాడు గదా అనుకునేదాన్ని. ఇప్పుడు గూడా మిమ్మల్ని చూచి - నా బిడ్డ |్రబతికుంటే యింత ఒడ్డూ పొడుగూ అయివుండేవాడు గదా - అని అను కుంటున్నాను.

చిక్క:— చాల్లే రంగనాయకీ! ఇప్పుడీ విరస |్రపసంగాలెందుకు? ఇంగితాన్ని గుర్తించక నువ్వు మా ఉత్సాహాన్ని, ఉద్వేగాన్ని పాడుచేస్తున్నావు. ముక్కోటి ఏకాదశివాడు కల్యాణ వేంకటేశ్వరుని ఆలయంలో నువ్వు నృత్యమాడుతుండగా చూచినప్పటినుంచీ నా మనసు మనసులోలేదు. తాపం దుస్సహామై ఒడలంతా దహించుకపోతూవుంది. (సమీపించడం కోసం రెండడుగులు వేస్తాడు)

రంగ:— (శాసిస్తున్నట్టు) యువరాజా! అటుకాదు—

చిక్క:— (దిగ్గున నిలబడిపోయి |్రపశ్నార్థకంగా ఆమె వైపు చూస్తాడు)

రంగ: (ద్వారం వైపు చేయిసాచి) అటు—

చిక్క:— (ఆమె భావమేమిటో సరిగ్గా స్ఫురించక) ఏమిటి?

రంగ:— వచ్చిన ద్వారం వీడ్కోలు చెప్పడానికి సిద్ధంగా వుంది.

తిరిగి చూడకుండా వెళ్లొచ్చు—

చిక్క:— కన్ను వేసిన ఆడదాన్ని కైవసం చేసుకోకపోవడం మా జాతకంలో లేదు,

రంగ:— యువరాజా! కామాన్ని అంధకారంతో ఎందుకు పోలుస్తారో నా కిప్పుడర్థమైంది. వయసులో మీ తల్లికి నాకూ అట్టే అంతరంలేదని సూచించాను. మీలో నా బిడ్డను చూచుకుంటూ వున్నానన్న విషయాన్ని ధ్వనించాను.

చిక్క:— నీతులు చెప్పవలసింది మా దగ్గరగాదు, శ్రీరంగంలో

రంగ:— వినండి యువరాజా! వృత్తి చేత నేను దేవదాసిని గావచ్చు కానీ వేశ్యను మాత్రంగాను, ఐహిక సుఖాల పైన నాకు మక్కువపోయి చాలాకాలమైంది. శరీరాన్ని, మనసును భగవంతుని కైంకర్యంకోసం అంకితంచేసి, విరాగినిగా జీవిస్తున్నాను.

చిక్క:— ఆహాహా! ఎంతసంగనాచివే రంగనాయకీ! ఈ పుష్పాలంకరణలు, అగరొత్తుల పరిమళాలు, చందనపాత్రలు, పన్నీటికలశాలు - ఇవన్నీ ఏవిటుని కొరకో నువ్వెదురు చూస్తున్నావనడానికి నిదర్శనాలు కావా ఏమిటి! ఎవరు నమ్ముతారు నీకల్లబొల్లి మాటలు?

రంగ.— అసత్యాలు పలకవలసిన ప్రమేయం నాకులేదు. ఈ నాడు నేను నాయిష్ట దైవాన్ని పూజించాలని అనుకున్నాను.

చిక్క:— అబ్బో, ఎవడో ఆ యిష్ట దైవం? పోనీ, ఈ నాటి నీ ఇష్ట దైవం నేనే ననుకోరాదూ? (తటాలున చేయి పట్టుకుంటాడు.)

రంగ:— (విదిలించి పారేస్తూ) చిక్కరాయా! ప్రాణాలు పోయిన తరువాత మాత్రమే నా తనువు నీవశమవుతుంది, నీకు శవాలుగూడా పనికొస్తాయా నాయనా?

చిక్క:— ఛీఛీ. అలా మట్లాడితే బెదరిపోతా మనుకోవద్దు. రాజ కుటుంబాన్ని ఆశ్రయించుకొని బ్రతికే దానివి. మేము చెప్పినట్లల్లా నడుచుకోవలసిన దానివి.

రంగ:— మంచి మాటే అన్నావులే నాయనా! నాకు బుద్ధొచ్చే మాటే అన్నావు. ఒట్టు పెట్టుకని చెబుతున్నాను నీ పరి పాలన ప్రారంభమయ్యేటప్పటికి నేనీ రాజ్యంలో వుండను.

చిక్క:— రంగనాయకీ! ఇది గుడిమేళంకాదనీ, నగరిమేళమనీ నువ్వు గ్రహించడం మంచిది. నువ్వీ రాజ్యం నుంచీ నిష్క్ర మించనూ లేవు. మా కోరికకు తల ఒగ్గకుండా జీవించ నూలేవు. మా ఉప్పు పులుసు తిని పెరిగిన శరీరం నీది! అది మాకే వినియోగం కావడం నీ అదృష్టం. నీకిస్తున్న గడువు కొద్ది రోజులే! గుర్తుంచుకో!
(విసురుగా ద్వారం వైపు తిరిగి రెండడుగులు వేసేసరికి గుమ్మంలో శ్రీరంగ రాయలు నిశ్చలంగా నిలబడివున్నాడు ఆ సమయంలో శ్రీరంగరాయలరాక ఆతడు ఎదురు చూడనిది. ముందుకు వేయబోయిన అడుగుతో అట్లాగే ఆగిపోతాడు.)

శ్రీరంగ:— (రంగనాయకివైపు చూస్తూ) యువరాజెందుకో కోపావిష్టులైవున్నారు. (చిక్కరాయలవైపు చూచి) జరగరానిదేమైనా జరిగిందా తమ్ముడూ?

చిక్క:— (తటాలున తేరుకున్నాడు) అన్నగారొచ్చారు గదా! ఇక మీదట జరిగితే జరగొచ్చు. (దూసుకుంటూ నిష్క్ర మిస్తాడు)

శ్రీరంగ:— పులిమీద పుట్రలా ఏమిటిదంతా రంగనాయకీ! ఇష్ట దైవానికి పూజన్నావు వచ్చిపోవలసిందిగా కబురు పంపావు ఈలోగా యువరాజుగారి రాక ఏమిటి? ఆయన క్రాగ్రహావేశం ఎందుకు కలిగినట్టు?

రంగ:— దేవదాసి అంటే ఆస్థానం సొత్తుకదండీ ప్రభూ! వాళ్లకు దానిపైన సర్వాధికారాలూ వుంటాయి. అనుగ్రహిస్తారు ఆగ్రహిస్తారు అరికాలితో రాచి పారేస్తారు ఏం చేసినా యిదేమని ప్రశ్నించడానికి వీలుండదు పోనీలెండి ప్రభూ! చంద్రగిరి రాజాస్థానంలో నాకున్న అనుబంధమింక కొద్ది రోజులే! చివరిసారిగా మీతో మాట్లాడే అవకాశం దొరికింది. అంతేచాలు.

శ్రీరంగ:— అంత విరక్తిగా మాట్లాడుతున్నావేమిటి రంగనాయకీ?

రంగ:— విరక్తి ఈనాటిది కాదు ప్రభూ! ఆరువేళ్ల నాటిది.

శ్రీరంగ:— రంగనాయకీ! ఆ పాత విషయం - నువ్వింకా విస్మరించనేలేదా?

రంగ:— జీవితం సాఫల్యం పొందడం గానీ, వైఫల్యం చెందడం గానీ - ఒకే ఒక సంఘటనపైన ఆధారపడినప్పుడు, దాన్ని విస్మరించడం సాధ్యమా ప్రభూ?

శ్రీరంగ:— (విస్మయంతో) నేనలా అనుకోలేదే! అదంతా ఒక పడుచుదనపు ఉద్వేగం అని మాత్రమే అనుకున్నాను. తప్పటడుగు వేయకుండా మనల్ని మనం నిగ్రహించుకోగలిగామని గూడా అనుకున్నాను.

రంగ:— లేదు ప్రభూ! నిగ్రహంగా నిలబడింది మీరు. నేను గాదు.

శ్రీరంగ:— (నివ్వెరపడిపోతూ) రంగనాయకీ!

రంగ:— అవును ప్రభూ! దీనురాలు, దుఃఖభాగురాలు అయిన ఒక స్త్రీని గురించి ఆలోచించే ఓపిక మీకుండి వుండదు. మీరు మగవారు, అప్పటికే వివాహితులు. మనసును నిగ్రహించుకోడానికి అన్ని వెసులుబాట్లూ వున్నవారు - 'ఇదొక దేవదాసి. ఎవడికి ఐడితేవాడికి అమ్ముడు పోవడమేగదా దీని బ్రతుకు. దాని ప్రసక్తి మనకెందుకు?' అని భావించి

వుంటారు. ఆతరుణి తన ఎలజవ్వనపు తొలిరోజుల్లో - తొలి చూపులోనే మీకు తన హృదయాన్ని సమర్పించు కున్నదనీ, నాటికీ, నేటికీ ఆమె శరీరంలోని ప్రతి నెత్తురు బొట్టులోనూ మీ రూపమే ప్రతిబింబిస్తూ వుందనీ, అసంకల్పితంగా జరిగిపోయే తన ఉచ్ఛ్వాస నిశ్వాసల్లో గూడా మీ పేరే నినదిస్తూ వుందనీ ఊహించే అవసరంగానీ, తెలిసే అవకాశంగానీ మీకు కలిగివుండవు—

శ్రీరంగ: — (నిర్వేదపాటుతో) చూడు రంగనాయకీ! పైచూపులకు సాగరం ప్రశాంతంగా కనిపిస్తుంది. అందులో అపారమైన బడబాగ్ని దాగివుంటుందని ఊహించడానికైనా వీలుండదు నీ మాటలు వింటుంటే, నాకలాగే అనిపిస్తూవుంది. ఇరవదేళ్లకు మునుపు జరిగింది ఒక చిన్న సంఘటన మాత్రమేనని నేననుకున్నాను. దాని నీడలు నీ జీవితం పైన యింతగా చిమ్మ చీకట్లు ప్రసరిస్తాయని మాత్రం ఎప్పుడూ అనుకోలేదు

రంగ.— పోనివ్వండి ప్రభూ! గత జలానికిప్పుడు సేతబంధన మెందుకు? వచ్చినప్పటినుంచీ నిలబడేవుండిపోయారు, దయచేసి ఆసనంలో అధివసించండి.

శ్రీరంగ:— (కూర్చుంటూ) కాదులే రంగనాయకీ! మనసువిప్పి చెప్పుకుంటే కొంత ఉపశమనమైనా కలుగుతుంది. కన్న తల్లిలా పెంచి పెద్దజేసిన మా వదిన అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించింది విషప్రయోగమని తెలిసినా పైకి చెప్పుకోడానికి వీల్లేకపోయింది. అర్ధాంగిని ప్రాణంతో సమానంగా ప్రేమించిన మా అన్న తిరుమలరాయలు మనశ్శాంతిని వెదుక్కుంటూ దేశాలపాలైనాడు. ఈ అవాంతరాలవల్ల నా మనసు పూర్తిగా వికలమైపోయిన కాలం అది.

రంగ:— తెలుసు ప్రభూ! ఆ వివరాలన్నీ చూచాయగా తెలుసు.

శ్రీరంగ:— అంతఃపురాలు కుట్రలకు, కుయుక్తులకూ నిలయాలు కొలువుకూటాలు కుతంత్రాలకు, కుటిలోపాయాలకు పుట్టినిండ్లు. రాజకీయాలు విషవలయాలు. ఈ వాతావరణం నుంచీ దూరంగా, మరీ దూరంగా పారిపోతే బాగుండనని అనుకున్నాను. అలా వెళ్లడానికి అనుమతించకుండా నన్నిక్కడ కట్టిపడవేసినది రెండే అనుబంధాలు....

రంగ:— సెలవివ్వండి.

శ్రీరంగ — ఒకటి దాంపత్యబంధం రెండోది - మా పినతండ్రి వేంకటపతిరాయలవారికి నా పట్లుగల అభిమానం చాలని దానికి అదనంగా యింకొక అనుబంధానికి జీవితంలో చోటు కల్పించే స్వస్థత నా చిత్తానికప్పుడు లేకపోయింది నీ వలపు కోరికను చెవిలో వేసుకోలేదంటే - అందుకిదే కారణం. నన్నర్థం చేసుకోగలవా రంగనాయకీ?

రంగ.— వద్దు ప్రభూ! అలా అర్థించకండి. మిమ్మల్ని యిక్కడికి పిలవనంపింది అభియోగాలు మోపడానికిగాదు. మాటల సందర్భంలో పాడు మనసు ఎట్లాగో బయటపడింది. చూచారా! రాక రాక మీరు నా యింటికొస్తే మాటలతోనే మభ్యపెట్టేస్తున్నాను, ఉండండి, ఒకక్షణం....

(ఓ మూలగావున్న పళ్లెం తీసుకొచ్చి పీఠంపైన అమర్చుతుంది. అందులోని పుష్పహారాన్ని తీసి అతని కంఠంలో వేయబోతుంది )

శ్రీరంగ:— (హారాన్ని చేతికే తీసుకుంటూ ఆశ్చర్యంతో) ఏమిటిదంతా?

రంగ:— చిన్న సత్కారమే ప్రభూ! వీరపూజ అనుకోవచ్చు. మహారాజుల వారి సంకల్పంమేరకు ఈ రోజు జింజి విజ

యోత్సవం జరగవలసింది. రాజనగరులోనే కొంత ప్రాతికూల్యం పర్పడడంవల్ల - అది జరగలేదు. లాంఛనంగానైనా జరిపించవచ్చును గదా - అని నాకనిపించింది.

శ్రీరంగ:— జింజీ విజయంలో నా పాత్రపముందిలే రంగనాయకీ! నిమిత్తమాత్రుణ్ణి. ఎందరో వీరులు ప్రాణాలకు తెగించి పోరాడి సాధించిన విజయం అది....

రంగ:— కావచ్చు ప్రభూ! కానీ ఏనుగకు తొండమెలాగో, సేనకు నాయకుడలాగనియుద్ధ తంత్రజ్ఞులు వాకొంటారు. ఉత్సాహాన్ని పూరించి, ఆవేశాన్ని పొంగించి, సైన్యాన్ని బరిలోకి దూకించవలసినవాడు సేనానాయకుడే! అందులోనూ మీరు నిష్ణాతులని - జింజీవిజయంవల్ల - లోకానికి ఋజువై పోయింది.

శ్రీరంగ:— నా సేవలు రాజ్యాక్షేమానికి ఉపకరించివున్నట్టయితే అది నా భాగ్యం!

రంగ:— మరింత పెద్ద పదవి మూలంగా - మరింత విస్తారంగా- మీ సేవలు రాజ్యాంగానికి లభ్యంకావాలన్నది పెద్దలఆశ. ఎందుకంటే ప్రభూ;—

శ్రీరంగ:— ఎందుకు?

రంగ:— పదవిలోవున్న వాడు నీతిమంతుడైతే ప్రజలున్నూ నీతిగా నడుచుకుంటారు, పదవిలోవున్న వాడు శీలసంపన్నుడైతే ప్రజలున్నూ సౌశీల్యంతో మసలుకుంటారు. పదవిలో వున్న వాడు న్యాయవర్తనుడయితే ప్రజలున్నూ న్యాయానికి లోబడి వర్తిస్తారు.

శ్రీరంగ:— చూడు రంగనాయకీ! శ్రీ కృష్ణరాయల వంటి వేంకటపతి దేవరాయలవారు తమ అవక్ర విక్రమంతో పెంచి పోషించిన సామ్రాజ్యాయిది. స్వామిభక్తుల్లో నేను

మొదటి వాణ్ణి. ప్రభువులు నా పైన ఏ బాధ్యత మోపినా దాన్ని వారి మనసుకు నచ్చేటట్టుగా నిర్వహించాలన్నది నా ప్రయత్నం అదే నా ధ్యేయం!

రంగ:— వేంకటపతి దేవరాయలవారు బాగా వయోవృద్ధులై పోయారు. మోయ గలిగినంత కాలం రాజ్యభారం మోశారు. వారి తదనంతరం గూడా ప్రజలు శాంతిభద్రతలతో సుఖసంతోషాలతో వర్ధిల్లాలి గదా!

శ్రీరంగ:— చిరంజీవి చిక్కరాయలు లేడా! అతడు మాత్రం ఆరవీటి వంశాంకురం కాడా? నీకా సందేహమెందుకు వచ్చింది రంగనాయకీ!

రంగ:— ఎందుకు లెండి ప్రభూ! కడుపు చించుకుంటే కాళ్ల పైన పడుతుంది. ఈ రాజ్యాన్ని, ప్రజల్ని రక్షించగలిగితే ఆ భగవంతుడే రక్షించాలి.

శ్రీరంగ:— తప్పకుండా రక్షించగలడని ఆశిద్దాం (నేపథ్యం నుంచీ తూర్యారావాలు వినిపిస్తాయి) అదిగో, ప్రభువుల వారు విశ్వరూప దర్శనార్థం గుడికి వెళ్తున్నారు. మరింక నేను సెలవు తీసుకోనా రంగనాయకీ!

రంగ:— అలాగే ప్రభూ! ఈ దాసిని మరచిపోరుగదూ!

శ్రీరంగ:— ప్రభువుల తర్వాత అంతగానూ నా గౌరవానికి పాత్రురాలివి నువ్వు! నిన్ను మరచిపోగలనా రంగనాయకీ!

రంగ:— ధన్యురాల్ని ప్రభూ! వెళ్లరండి.

శ్రీరంగ:— (నిష్క్రమిస్తాడు)

( తెర )

# 3

[యువరాజువిడిది. రంగనాయకి మందిరంలో శ్రీరంగ రాయలకు జరిగే 'సత్కారాలను' తలుచుకుంటూ చిక్కరాయలు ఆగ్రహోదగ్రుడై పోతున్నాడు. అదృశ్యాలు, సల్లాపాలు తన కళ్లఎదుటే జరిగినట్టు ఊహించుకుని ఆదురాగ్రహంలో గది లోని వస్తువుల్ని చిందరవందరగావిస్తున్నాడు. ఆఖరుకు చేతిలోని మధు పాత్రను గూడా బద్దలైపోయేటట్టు నేలపైకి విసరి కొడతాడు. ఏదో అలజడి ప్రారంభమైందని పసిగట్టిన జగ్గరాయలు తొందర తొందరగా రంగంపైకి ప్రవేశిస్తాడు]

జగ్గ:— చిక్కరాయా! ఏకాంతంలో ఈ ఉగ్రతాండవం ఏమిటి నాయనా! ఎవరిపైన నీ ఆగ్రహం?

చిక్క:— ఎవరిపైన? ఆ తేనెపూసిన విషకరవాలం.... ఆ నక్క జిత్తుల నయవంచకుడు ... ఆమాయ వేషాల మేక వన్నెపులి.... వాడి నిజస్వరూపమేమిటో నాకిప్పుడే తెలిసింది.

జగ్గ:— ఎవణ్ణి గురించి నాయనా నువ్వనేది?

చిక్క: - మామయ్యా! నువ్వుచెబుతే నేనేమిటో అనుకున్నాను ఇప్పుడు తెలిసింది. నేను నడిచేదారిలోని విషకంటకం వాడే! నేను పడుకునే ప్రక్కలోని బల్లెంవాడే! శ్రీ రంగడు కాదు. వాడు నంగినడకల దొంగరంగడు.

జగ్గ:— చూచావా! నాకు తెలుసు. ఎప్పుడో ఒకప్పుడు వాడి పైన నీకు పీకలదాకా కోపంవస్తుందని నాకు తెలుసు.

చిక్క:—మామయ్యా! నాకుకోపం వచ్చేదాకా తామసించడం నీ తప్పు నీకు కోపం వచ్చినప్పుడే వాణ్ణి మనదారి నుంచీ తొలగించి వుండవలసింది.

జగ్గ.— ఇప్పుడైనా మించి పోయిందేముంది?

చిక్క:— (ఆక్రోశిస్తున్నట్టుగా) మించిపోయిందేమీ లేదా! ఉంది మామా! ఉందిగనుగనే నా శరీరంలోని ప్రతి నెత్తురు బొట్టూ ఆగ్రహంతో ఉడికిపోతూవుంది.

జగ్గ: – అట్లాగా చిక్కరాయా! ఏంజరిగి ది నాయనా? వాడే దైనా కుట్రపన్నుతున్నట్టు - నీకాధారం దొరికిందా?

చిక్క:— ఆధారమా! నాకళ్లతో నేనే చూచాస్తే, దానికింకొక ఆధారం కూడానా!

జగ్గ:— (ఆతురతగా) ఏం చూచావు? ఎక్కడ చూచావు?

చిక్క:— వద్దు మామా! ఆ సంగతి మాత్రం నన్నడగొద్దు, (ఇందాకా తాను ఊహించిన దృశ్యాలన్నింటినీ మళ్లీ మనసులోకి తెచ్చుకుంటూ, కళ్లు మూసుకుని) అదంతా మళ్లీ మనసులో మెదిలితే నేను భరించలేను, సహించ లేను.

జగ్గ:— ఒస్, ఇంతేనా! ఇంత జేసీ యిదేదో కామ వ్యవహారంలా వుంది. అంతేనా, చిక్కరాయా?

చిక్క: – అట్లా తీసి పారెయ్యొద్దు మామా! నీదాకా వస్తేనే గానీ నీకు తెలియదు. నువ్వువలచిన సుందరాంగితో ఇంకొకడు కులుకుతూవుంటే నీకెలా వుంటుంది?

జగ్గ:— (ప్రసంగం పెడదారి పడుతున్నదని గ్రహించి, ముఖం చిట్లించుకుంటూ) బాధగానేవుంటుంది. మరైతే నువ్వు కూర్చోవలసిన సింహాపీఠికపైన ఇంకొకరు కూచుంటే, అప్పుడు మరింత బాధగా వుండదా?

చిక్క.— (చిరాకుతో) ఎందుకుండదు?

జగ్గ:— అటువంటి అవాంతరం ఏర్పడకుండా, నువ్విప్పటి నుంచీ, జాగ్రత్తగా వుండనక్కర్లేదా?

చిక్క:— మామయ్యా! అవంతా గమనించడానికి గాకపోతే నువ్వొక్కడివి యిక్కడుండడమెందుకు? వెయ్యికండ్ల ఇంద్రుడివిలా నువ్వు రాచకార్యాలన్నీ జాగ్రత్తగా కని పెడుతున్నావు గదా!

జగ్గ:— కనిపెడుతూనేవున్నాను, కానీ మీ అయ్య వేంకటపతి దేవరాయలు సామాన్యుడు కాదు. రాజనీతిలో జూలు నెరసిన ముసలిసింహం. ఆయనగారి నమ్మిన బంటు యాచమనాయకుడు మాత్రం? కాకలు తీరిన రాజ్య తంత్రజ్ఞుడు. వాళ్ల ఎత్తుల్ని చిత్తుచేయడానికి నేనొక్కణ్ణే చాలను.

చిక్క:— అది నీ శక్తియుక్తుల్ని నువ్వు గుర్తించకుండా చెబుతున్న మాట! చాణక్యుణ్ణి చంపి పుట్టినవాడివి. యుగంధరుడికి ఉజ్జీ అయినవాడివి, తిమ్మరుసుకు తీసిపోని వాడివి - నీ కింకొకడి తోడ్పాటెందుకు చెప్పు పోనీ, కావాలేఅనుకో, అందులో నీకు సాధ్యంకానిదేముంది? కోను, మధువు, మదవతీ; పదవీ, పసిడీ - ఎవడికేది కావలిస్తే అది వాడి ముఖాన పారేసి కొను.

జగ్గ:— ప్రస్తుతానికదేనయ్యా నా ప్రయత్నం. ఇందులో నేను సూత్రధారుణ్ణిగా వుంటాను, నరే! నువ్వు పాత్రధారుడివిగా నైనా వుండాలి.

చిక్క:— నేను లేక ఏమైపోయాను మామయ్యా! ఉన్నాను గదా!

జగ్గ:— (ద్వారం దగ్గరికి వెళ్లి, చేతులు తడుతూ) ఇదిగో మన్నారూ! (చిక్కరాయలతో) వీడే మన కంచుకి. పేరు మన్నారు దాను.

( ప్రవేశం - కంచుకి )

కంచుకి:— యువరాజులుం గారికి వందనాలు, జగ్గరాజులుం గారికి అభివందనాలు.

జగ్గ:— మామనసుకు నచ్చిన వాడివి మా నమ్మకానికి పాత్రుడైన వాడివి, ఏమయ్యా, మన్నారుదాసూ! యువ రాజులుంగారు నిన్ను పిలిపించినారంటే - నీ పంట పండిం దన్న మాట!

కంచుకి:— చిత్తం చిత్తం. రాజునే దైవంగా నమ్మినవాణ్ణి. రాజు సేవలోనే బ్రతికినవాణ్ణి.

జగ్గ:— మంచిది, మంచిది. మేమిప్పుడు చెయ్యమంటున్నదీ అదే! (సాభిప్రాయంగా చిక్కరాయలవైపు చూస్తూ) చెప్ప మంటూరా యువరాజా!

చిక్క:— (అంగీకారం సూచిస్తూ తల వంకిస్తాడు)

జగ్గ:— మహారాజులుంగారు బాగా వృద్ధులై పోయారు. వారి ఆరోగ్యం గూడా నానాటికీ క్షీణిస్తూవుంది. అదను చూచు కొని కొన్ని విద్రోహశక్తులు రాజకుటుంబానికి కీడు చేయాలని ఉంకిస్తున్నాయి.

కంచుకి:— నా బొందిలో ఊపిరుండగా ప్రభువుల వారికి అప కారం జరగదు.

జగ్గ:— తెలుసు, తెలుసు. నువ్వంతటి రాజభక్తుడివే. కానీ ఎప్పటికప్పుడు లోపలాబయటా గూడా జరిగే విద్రోహ చర్యల్ని పసిగట్టవలసిన అవసరం మనపైన వుంది.

కంచుకి:— చిత్తం, చిత్తం.

జగ్గ:— ఎందుకు చెబుతున్నానంటే - రాజమందిరానికి ప్రధాన రక్షకుడివి నువ్వు. నీ ఎరుక లేకుండా ప్రభువుల వారిని దర్శించే వాళ్లుండరు. ఎవరెవరు ఏ ప్రసక్తి పైన వస్తు న్నారో, ఎట్టి మంతనాలు సల్పుతున్నారో నువ్వు గమ

నించాలి, రాజభవన వర్తమానాలన్నీ మాకు తెలియ
జేస్తూ వుండాలి.

కంచుకి:— చిత్తం.

జగ్గ:— అంటే ఏమన్నమాట? ఈ క్షణం నుంచీ నువ్వు యువ
రాజు గారి గూఢచారిగా వ్యవహరించాలన్నమాట!

కంచుకి:— మహారాజుల్ని సేవించినట్టే, యువరాజులుంగారిని
గూడా సేవించుకోవాలన్నది నా కోరిక.

జగ్గ:— యువరాజు మహారాజయ్యే సుముహూర్తం దగ్గర్లోనే
వుంది, అప్పుడు నీ సేవకు తగిన పారితోషికం నీకు లభి
స్తుంది. పదవి గూడా హెచ్చుతుంది.

కంచుకి — అంతా తమ దయ!

జగ్గ — ఇకనువ్వు వెళ్లవచ్చు.

కంచుకి:— చిత్తం, చిత్తం (నిష్క్రమిస్తాడు.)

( తెర )

# 4

[తిరుమలపైన జాబాలి తీర్థానికి సమీపంలో ఒక గుహ. అంతర్భాగం కనిపించకుండా గుహ ఎదుట ఒక తెరవుంటుంది, తెరముందు ఒక రాతిపైన కూర్చుని చిన్నతంబురా మీటుతూ శిష్యుడు తత్వం పాడుకుంటున్నాడు ]

శిష్యుడు:— విలువ మాయనిది గురువాక్యం
వృథాపోనిది గురువాక్యం
నమ్మినవారికి గురువాక్యం— అది
క్షేమ మిచ్చులే గురువాక్యం.

వన్నె మాయనిది గురువాక్యం
చెన్నుతరగనిది గురువాక్యం
ఎల్లవారలకు గురువాక్యం—అది
శిరోధార్యము గురువాక్యం.

సత్య సమ్మతం గురువాక్యం
సాధు సమ్మితం గురువాక్యం
మంచివారలకు గురువాక్యం— అది
మహదానందము గురువాక్యం.

వాడి తగ్గనిది గురువాక్యం
వేడి పీడనిది గురువాక్యం
క్రూరచిత్తులకు గురువాక్యం— అది
మారణాయుధం గురువాక్యం.

నిశ్చల దీపం గురువాక్యం
నిరుపమతేజం గురువాక్యం
భక్తిపూరితం గురువాక్యం— అది
ముక్తిదాయకం గురువాక్యం ॥విలువ॥

(పాట సగంలో వుండగానే కవిరంగభట్టు మెల్ల మెల్లగా రంగంపైకి వస్తాడు. పాట వింటూ, పాడుతున్న కుర్ర సన్యాసి వైపు ఎగాదిగాచూస్తూ నిలబడిపోతాడు. అర్ధ నిమీలిత నేత్రాలతో కూర్చున్న శిష్యుడు అతని పొలకువను గమనించడు పాట పూర్తి కాగానే రంగభట్టు ఉపక్రమిస్తాడు)

భట్టు:— ఆహా. ఏమి గురుభక్తి! ఏమి ధ్యానయోగం! ఏమి బ్రహ్మ తేజస్సు!

శిష్యుడు:— (తటాలున కళ్లు తెరిచి అయోమయంగా ప్రశ్నిస్తాడు.) ఎవరని గురించి మాట్లాడుతున్నావు నాయనా!

భట్టు:— ఇంకెవరిని గురించి! నిన్ను గురించేనయ్యా చిన్న స్వామీ! పరమేశ్వరుని సన్నిధానంలో గణాధిపతిలా, విష్ణువుసన్నిధిలో విష్వక్సేనుడిలా - అవధూత స్వామి శ్రీ సచ్చిదానందులవారి గుహాముంగిట - నువ్వు!

శిష్యుడు:— ఇంతకూ నువ్వెవరివి నాయనా?

భట్టు:— అదీ అసలు ప్రశ్న. ఇదిగో సమాధానం. అవధరించు.

తలలు దిమ్మనునట్లు - జలపాతమైనూకు
పీరకవిత్వమ్ము వృత్తిమాకు
తడబాటు లేకుండ, గడియకేబది పద్య
ములు చెప్పగలమన్న బిరుదుమాకు
ప్రభువు శ్రీ వేంకటపతిరాయ పుత్రుండు
చిక్కరాయలు గొప్పదిక్కు మాకు

యువరాజ సఖుడంచు, కవి కుమారుడటంచు
రాజ్యమెల్లెడను గౌరవము మాకు
సరస శృంగార సాహిత్య సాగరమును
జుర్రి త్రేన్చిన రసికరాజులము మేము!
వాసికెక్కిన జవ్వాది వంగడమున
అవతరించిన రంగభట్టారకులము.

శిష్యుడు:— బాగుంది నాయనా! కానీ నీ పద్య విద్యా ప్రదర్శనానికి ఊళ్లే లేక పోయాయా? ఈ అడవే దొరికిందా?

భట్టు:— కాదులేవయ్యా స్వామీ! ఎంత పెద్ద సొరకాయ అయినా కత్తిపీటకులోకువేగదా! మా భవిష్యత్తు తెలుసు కోవాలని మాకూ వుంటుంది. అందుకని (గుహవైపు చూస్తూ) స్వాముల వారి దర్శనార్థం....

శిష్యుడు:— ఎందుకూ? హస్తసాముద్రికంలో నాకున్నూ కొంత పరిచయం కద్దు! ఏదీ నీ చెయ్యి?

భట్టు:— (దుమ్ముదులుపుతున్నట్టుగా చేయిని బాగా తుడిచి శుభ్రం చేసి పద్మాసనంలో కూచుని, చేయి చూపిస్తాడు)

శిష్యుడు:— (కొద్ది క్షణాలు బాగా పరకాయించి చూచిన తర్వాత తలపైకెత్తి) పెద్ద కొండకే సన్నలు వేస్తు న్నావు నాయనా!

భట్టు:— (తటాలున శిష్యుడి చేతిని పట్టుకుని) చిన్నస్వామీ! నా కోరిక నెరవేరుతుందా?

శిష్యుడు:— బాబ్బాబూ! అది మాత్రం అడగొద్దు! ఆ మాట స్వాముల వారే చెప్పాలి.

భట్టు:— నేను ప్రాధేయపడడం గూడా అందుకే నయ్యా చిన్నస్వామీ! నీ ఋణం వుంచుకోనులే. చెప్పు, కట్టు కోను కాషాయ వస్త్రాలు కావాలా? కప్పుకోను దుప్ప డాలు కావాలా? వేసుకోను వెండి తావళాల రుద్రాక్ష

మాలలు కావాలా? నువ్వేదడిగినా ఇప్పిస్తానయ్యా! లోపలికి ప్రవేశమిప్పించుచాలు!

శిష్యుడు:— (చిరాకుగా) ఏమయ్యా కుర్రకవీ! నీకున్నూ ఈ ముహూర్తమే దొరికిందా?

భట్టు — ఇంకా ఎవరైనా వస్తున్నారటయ్యా చిన్నస్వామీ!

శిష్యుడు:— మరొకరు మరొకరూ కాదయ్యా మహానుభావా! సాక్షాత్తుగా చంద్రగిరి సామ్రాజ్యాధీశ్వరులు, శ్రీ శ్రీ శ్రీ వేంకటపతి దేవరాయ ప్రభువులవారు....

భట్టు:— ప్రభువుల వారిక్కడి కొస్తున్నారా? ఈ రోజు?

శిష్యుడు:— ఈ పాటికే రావలసింది, ఇందాకా ఒక రాజభటుని మూలంగా వర్తమానం అందింది.

భట్టు:— చూచావా చిన్నస్వామీ! స్వాములవారి కీర్తి కొండ దాటి, కోనదాటి, పల్లెదాటి పేటదాటి, కోటలోపలికి గూడా ప్రాకిందంటే అంతకంటే ఘనత ఏముంటుంది చెప్పు. ఎవరో అవధూత స్వాములవారట. బదరీ కేదారంలో వాలుగేండ్లు గాలి భోంచేసి తపస్సు చేశారట! జలస్తంభనం అభ్యసిస్తూ మూడేండ్లు మానస సరోవరంలో నివసించారట! ఎప్పుడొచ్చారో. ఎట్లావచ్చారో తెలియదుగానీ ప్రస్తుతం తిరుమలకొండపైన జాబాలి తీర్థం దాపున ఒక కొండ గుహలో నివసిస్తున్నారట! ముఖం చూడగానే మనసులోని ఇంగితాన్ని గ్రహిస్తారట! అది కాయోపండో తేల్చి చెప్పేస్తారట! ఏ నోట విన్నా యిదే విశేషం! నేనూ అందుకోసమే వచ్చానయ్యా బాబూ? నాకున్నదల్లా ఒకటే కోరిక.

శిష్యుడు:— ఉండవయ్యా కుర్రకవీ! ఎవరో వస్తున్నట్టుందికదూ?

భట్టు:— చిన్నస్వామీ! ప్రభువులు వెళ్లిన తర్వాతనైనా నాకు స్వామి దర్శనం....

శిష్యుడు:— తుమ్మజిగురులా పట్టుకున్నావు నాయనా! వదలవే! అట్లాగే చూద్దామన్నానుగా!

భట్టు:— ఎట్లాగైనా మంచివాడివే! వస్తాను. మళ్లీ వస్తాను. (భట్టు వేగిరంగా మరొకవైపుకు నిష్క్రమిస్తాడు. కంచుకి ముందు రాగా, యాచమనాయకుడు వెంబడించగా రాయలవారి ప్రవేశం.)

శిష్యుడు:— (వినమితగాత్రుడై, చేతులుకట్టుకుని) నావిష్ణుః పృధివీ పతిః, పృధ్వీపతులకు నమస్కారం! దయచేయండి ప్రభూ! ఇటు.... ఇటు....

(తెరలేస్తుంది. గుహాంతర్భాగం కనిపిస్తుంది. శిష్యుడు వచ్చినవారిని లోపలికి తీసుకెళ్తాడు. ఒక ఎత్తయిన రాతిపైన స్వాములవారు ఆసీనులై వున్నారు. ఎట్టయెదుట త్రిశూలం ఒక మూల నుంచీ సాంబ్రాణి ధూపం సన్న సన్నగా వ్యాపిస్తూవుంది. కంచుకి తాను ఫల పుష్పాదులతో తెచ్చిన పళ్లెరాన్ని స్వాములవారి ముందు ఉంచి వినమిత శరీరుడై వచ్చినవారిని పరిచయం గావిస్తాడు)

కంచుకి:— స్వాములవారి దర్శనార్థం.... యాచమనాయక సహితంగా.... రాజలాంఛనాలను విసర్జించి పాదచారులై.... శేషాచల స్వామి భక్తులు, సుజన విధేయులు, యోగీంద్ర పూజాతత్పరులు.... శ్రీశ్రీశ్రీ ఆరవీటి వేంకటపతిదేవరాయల వారు....

రాయలు }<br>యాచమ } సంయమీంద్రులకు నమస్కార సహస్రాలు!

(కంచుకి, శిష్యుడు చెరొకవైపు నిష్క్రమిస్తారు)

స్వామి:— శుభమస్తు! ఇష్ట వాంఛా ఫలసిద్ధిరస్తు! ఆసీనులు కండి! (స్వాములవారికెదురుగావున్న రాతి దిన్నెపైన రాయలవారు, యాచమనాయకుడు ఆసీనులవుతారు)

రాయలు:— ఏకాంతంగా మాత్రమే తమను దర్శించుకోవాలన్న మావినికిడికి వచ్చింది. అయినా నియమాన్ని ఉల్లంఘించినందుకు క్షమించ గోరుతున్నాం, ఎందుకంటే వీరు.... వేంకటగిరి సంస్థానాధీశులు.... మహామండలేశ్వరులు.... మాకు ప్రాణమిత్రులు అయిన వెలుగోటి యాచమనాయకులవారు. తనువులు వేరైనా మాకు మనసులొక్కటే! మా యిద్దరి నడుమ దాపరికాలు లేవు.

స్వామి:— మంచిది, మంచిది. వెనువెంట నీడగా, నడిచేదారిలో తోడుగా, ఎండవానల్లో గొడుగుగా ఉపకరించే ఆప్త మిత్రుడు దొరికినందువల్ల ప్రభువులవారు ధన్యులు, ప్రభువుల మనసులో యింతగా చోటు సంపాదించుకోడం వల్ల యాచమనాయకులున్నూ చరితార్థులు. మీ కలయిక నరనారాయణుల సఖ్యతవలె, శ్రీకృష్ణార్జునుల స్నేహానుబంధంవలె లోకానికి క్షేమదాయకం కావాలని, కాగలదని మా ఆశయం!

రాయలు:— స్వాములవారి ఆశయం అమోఘమే! యాచమనాయకులవారి అండదండలు గూడా మాకు అమూల్యమైనవే! ఏటొచ్చీ ఈ రాజ్యభారంమాత్రం మాకు మోయరాని బరువై పోతూవుంది స్వామీ! శరీరం డస్సిపోయింది. నేత్ర పాటవం తగ్గిపోయింది. శక్తియుక్తులు సన్నగిల్లిపోయాయి శరీరమనేది చిన్నచెరసాలగా, రాజ్యాధికారమనేది పెద్ద చెరసాలగా ఈ జీవుడు కొట్టుమిట్టాడిపోతున్నాడు స్వామీ!

స్వామీ:— (దరహాసంతో) ప్రభువులవారు ఎన్నో ఆహవాల్లో గెలిచిన మహావీరులని విన్నాము, దేశంలో పొడచూపిన కల్లోలాలను సమూలంగా తుడిచిపెట్టిన రాజనీతిజ్ఞులని

విన్నాము. పదవి కలిగినా పొంగిపోకుండా, అధికార మొచ్చినా నిరంకుశులుగాకుండా, స్వంత క్షేమం కన్నా ప్రజా క్షేమమే పరమావధిగా, ధర్మాన్ని నాలుగుపాదా లతో నడిపించే పరిపాలనా దురంధరులని గూడా విన్నాము. కానీ వారు వేదాంతులని మాత్రం యిప్పుడే గ్రహించాము. ఏమండీ! యాచమనాయకులవారూ! ఇందాకా ప్రభువులు చెప్పిన మాట మీకు గుర్తుందా?

యాచమ:— ఉంది స్వామీ! శరీరమనేది చిన్న చెరసాలగా, రాజ్యాధికారమనేది పెద్ద చెరసాలగా, అందులో ఈ జీవుడు కొట్టుమిట్టాడి పోతున్నాడు - అన్నారు!

రాయలు:— ఇది వేదాంత కాదు స్వామీ! స్వానుభవం. 'రాజ్యాంతే నరకంధ్రువం' అని పెద్దలమాట. రాజ్యం చివరలో ఎప్పుడో నరకం వస్తుందంటే ఆమాట మమ్మల్ని వెక్కిరిస్తున్నట్టుగావుంది. ఎందుకంటే స్వామీ, రాజ్యాన్ని పాలిస్తున్న దశలోనే మేము అనుదినమూ, క్షణ క్షణమూ నరకయాతన చవి చూస్తున్నాము.

స్వామి:— [ఏదో చెప్పదలచుకుని) ప్రభువులు విజ్ఞులు....

రాయలు:— (అడ్డుతగులుతూ) తాము సర్వజ్ఞులు....

స్వామి:—కాదు, కాదు. సర్వజ్ఞుడనే బిరుదు ఒక్క సర్వేశ్వరునికి మాత్రమే సార్థకం మావిజ్ఞత అనుమతించినంతలో మేము చెప్పగలిగిందేమిటంటే....

రాయలు:— చెప్పండి స్వామీ!

స్వామి:— ఆత్మబలానికి అగ్ని పరీక్షవంటి గడ్డు పరిస్థితి ఎంతటి వారికైనా దాపురిస్తూ వుంటుంది. కురుక్షేత్రంలో ఉభయ సేనలమధ్య రథం నిలిచినప్పుడు పాండవ మధ్య మునికి ఎదురైన పరిస్థితి గూడా అదే! 'ఒడలు కంపించి పోతూవుంది. గాండీవం చేజారి పోతూవుంది. నిశ్చలంగా

నిలబడలేక పోతున్నాను స్వామీ!' అంటూ ఆక్రోశించిన అర్జునునితో భగవాను డేమన్నాడు?

( ఒక క్షణం నిశ్శబ్దం )

స్వామి:— (మళ్లీ నిశ్చలంగా-ఈ సారి యాచమనాయకుడి వైపు చూస్తూ) యాచమనాయకులవారూ! మీరు భగవద్గీతలు చదువుకో లేదా? అప్పుడు భగవంతు డేమన్నాడు?

యాచమ:— ( ఉలిక్కిపడ్డట్టు ) క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥....

—అన్నాడు.

స్వామి:— అవునండీ యాచమనాయకులవారూ! ఆ మాటే మీరు ప్రభువులవారితో చెప్పవలసింది. ఎందుకంటే వారి నిప్పుడు క్రుంగదీస్తున్నది కేవలం శరీర దౌర్బల్యమే గాదు. మరేమిటి? హృదయ దౌర్బల్యం. అదెటువంటిది? క్షుద్రం. క్షుద్రమైనది. త్యక్త్వ. త్యజించు, ఉత్తిష్ఠ. లేచి నిలబడు.

రాయలు:—హృదయ దౌర్బల్యం క్షుద్రమైనదని తెలుసు స్వామీ! కానీ తొలగించుకోవడానికి వీలుకావడం లేదే?

స్వామి.— గీతాచార్యుడే అందుకుపాయం సెలవిచ్చినాడు గదా! ఈ శరీరం నాదికాదు, ఈ సంపద నాదికాదు, ఈ సంసారం నాదికాదు - అన్న భావనతో రాగద్వేష రహితంగా, నిస్పృహపాతంగా నీ స్వధర్మాన్ని నువ్వు నిర్వర్తించు—

రాయలు:— ప్రయత్నిస్తాను స్వామీ!

స్వామి:—మీ ప్రయత్నానికి అసాధ్యమైనదేదీ లేదు. శకావికలై పోయిన సామ్రాజ్యానికి కాయకల్పచికిత్సచేసి, మళ్లీ ఒక గొడుగు నీడ క్రిందికి తెచ్చినవారుమీరు, బహిశ్శత్రువులనేగాక, అంతశ్శత్రువులను గూడా మట్టికరిపించి

సుస్థిర పరిపాలనం ఏర్పాటు చేసిన వారు మీరు. సంగీత సాహిత్యాలకు, శిల్పనృత్యాలకు చలువ పందిళ్లు వేసిన వారు మీరు. దండిగా అనుభవించారు. నిండుగా జీవించారు. ఏ విధంగా చూచినా మీరు పూర్ణ పురుషులు.

రాయలు:— మేమూ అట్లాగే అనుకుంటూ వచ్చాము....

యాచమ — మనశ్శాంతి కరువై పోవడం యిటీవల కొంత కాలం నుంచే....

స్వామి:— అంత అవసరమేమీ కనిపించదే! ప్రభువుల వారికి కొరతేముంది? — సంతానం లేకపోవడం ఒక్కటి తప్ప!

యాచమ:— (తలపైన పిడుగుపడినట్టు) స్వామీ!

స్వామి:— అవునండీ. యాచమనాయకులవారూ! సంతానం లేకపోవడం దురదృష్టమే! కానీ అందుకు చింతించి ప్రయోజనమేముంది? సంతానం కలగడంగానీ, కలగక పోవడంగానీ భగవదాయత్తంగదా?

యాచమ:— స్వాములవారి సర్వజ్ఞతను నేను శంకించలేకుండా వున్నాను. ప్రభువులవారు అనపత్యులుకారు స్వామీ! యుక్తవయస్కుడై, యౌవరాజ్య పట్టాభిషేకానికి అర్హుడైన కుమారుడు వారికున్నాడు

స్వామి:— ( ఒక క్షణం కండ్లుమూసి, మళ్లీ తెరిచి, తన అభి అభిప్రాయానికి తిరుగులేదన్నట్టుగా తలాడిస్తాడు)

యాచమ:— ఇదేం విపరీతం స్వామీ! నిండుచెరువులో నీళ్లు లేదంటున్నారు మీరు!

స్వామి.— లేనిది ఉన్నట్టు, ఉన్నదిలేనట్టు కానరావడం ఇహ లోక జీవితంలోని ఇంద్రజాలం నాయనా!

యాచమ:— ( తటాలున లేచి నిలబడి ) మంచిది స్వామీ! గోరు చుట్టకు మందువేస్తారేమోనని మీ దగ్గరికొస్తే,

చాలని దానికి మీరొక రోకటిపోటు ప్రసాదించారు. ఎలాగైనా తమరు గూడా మానవులే గదా! ముదిమి వల్ల మతి స్తిమితం తప్పివుంటుంది.

రాయలు:— (వారిస్తూ) యాచమనాయకులవారు శాంతించాలి ....మన్నిచండి స్వామీ! ఇంతకాలంగా పొగమబ్బులాంటి దేదో మమ్మల్ని ఆవరించినట్టు, ఇప్పుడది క్రమక్రమంగా విచ్చిపోతున్నట్టు....

యాచమ:— (నిగ్రహించుకోలేక రాయలవారి చేతిని పట్టుకుని) ప్రభూ!

స్వామి:— యాచమనాయకులవారూ! ఆదిలోనే మనవి చేశాము మేమయినా సర్వజ్ఞులమేమీ కాదని....

రాయలు:— అంతమాటనకండి స్వామీ! మా అజ్ఞతకు మేము సిగ్గుపడుతున్నాము.

యాచమ:— ప్రభూ! ఏమిటిదంతా! నాతల బ్రద్దలై పోతూ వుంది. శరీరంపైన తేళ్లూ జెర్రులు ప్రాకినట్టుంది, ఇదిగో (చేతులు తడుతూ) కంచుకీ!

( కంచుకి - ప్రవేశం )

రాయలు.— సెలవిప్పిస్తారా స్వామీ!

స్వామి.— మంచిది. ఇష్టవాంఛా ఫలసిద్ధిరస్తు! వెళ్లిరండి!

కంచుకి:— దయచేయండి ప్రభూ! ఇటు.... ఇటు....

(కంచుకి, యాచమనాయకుడు, రాయలవారు నిష్క్రమిస్తారు. కొంతసేపు నిశ్శబ్దం. గుహాలోని ఒకబండరాయి చాటునుంచి గొబ్బూరి జగ్గరాజు మెల్లగా ఈవలికి వస్తాడు. పాదరక్షల చప్పుడు మాత్రం నిశ్శబ్దాన్ని చీలుస్తుండగా వెళ్లి స్వాములవారి ఎదుట నిలబడతాడు. ఆగంతుకుడెవరో, అతడి ఆంతర్యమేమిటో అర్థంగాక స్వాముల వారతని వైపు నిశ్చలంగా చూస్తున్నారు.)

జగ్గ:— యోగి వర్యులకు నమస్కారం!
స్వామి:— ఎవరు నాయనా నువ్వు?
జగ్గ:— నేను.... ఎవరినా? ఎవరినో తెలియదా? అవధూతల పాలి యమదూతనండీ స్వామీ! కోరపండ్లు లేవే, మిడి గ్రుడ్లులేవే. విచ్చుకత్తులు లేవే, యమపాశాలులేవే-అను కుంటున్నారా? నేనూతమలాగే మారువేషంతో వచ్చాను లెండి! ఈ జటాపాశాలు, ఈ రుద్రాక్షసరాలు, ఈ విబూతి లేపనాలు, ఈ కాషాయవస్త్రాలు - చెప్పు - ఈ ముసుగులన్నీ తీసేస్తే నువ్వెవడివి?
స్వామి.— అవును. 'నేనెవర్ని?' నా జిజ్ఞాసంతా అదేనాయనా! ఈ జటాపాశాలు నేనుగాదు. ఈ శిరస్సు నేనుగాదు. ఈ కరచరణాలు నేనుగాదు. అయితే నేనెవణ్ణి? పరమ యోగీశ్వరులకైనా అంతుబట్టని రహస్యం యిదే నయ్యా!
జగ్గ:— బెంగపడొద్దు. నేను బోధ పరుస్తానుగా! కానీ ముందుగా నా మాటకు బదులుచెప్పు. సంతానంలేదని చెప్పి మహా రాజు మనసులో విషబీజం నాటవలసిన అవసరం నీకే మొచ్చింది?
స్వామి:— అది విషబీజం కాదు నాయనా! సత్యబీజం.
జగ్గ:— ఆహాహా! ఏదీ. అటువంటి సత్యం యింకొకటి చెప్పు చూద్దాం.
స్వామి:— సత్యానికేం కొదువ నాయనా! ఎవరు త్రవ్విన గోతిలో వారే పడుదురు. అదొక సత్యం. పాములు కప్పల్నిబట్టి మ్రింగినట్టుగా మీ పాపాలే మిమ్ము మ్రింగును. అదొకసత్యం. విపరీతబుద్ధి వినాశకారణం. అదొకసత్యం.
జగ్గ:— నేనడిగిన సత్యం నన్నుగురించి, నేనెవణ్ణి?

స్వామి:— ఆహా! నీలో గూడా ఆత్మజిజ్ఞాస మొదలైందా నాయనా?

జగ్గ:— ఓరి దొంగ సన్యాసీ! పులివంజాను దువ్వినట్టుగా నాతో పరిహాసాలాడడానికి ప్రయత్నించవద్దు కొండంత కొడుకు కండ్ల ఎదుట నడయాడుతుండగా - సంతానమే లేదు పొమ్మని నువ్వు మహారాజును మభ్యపెట్ట జూచావు. ఎందుకని? అందువల్ల నువ్వు ఆశించిన ప్రయోజన మేమిటి?

స్వామి:— అప్రియమైనా సత్యాన్ని పలకడం మా వ్రతం నాయనా!

జగ్గ:— సరే నీమాటకే వస్తాను. మహారాజుకు సంతానయోగం లేని పక్షంలో, మహారాణి ఎలాగు తల్లి కాగలిగింది? అక్రమ సంబంధం వినా దారిలేదే! మహారాణి శీలానికే మచ్చపులుముతావా? కత్తికొక కండగా తరిగి నిన్ను కాకులకు వేసినా తప్పులేదు

స్వామి:— తప్పు నాయనా! అర్థంగాకపోతే ఊరుకోవాలే గానీ దుర్వ్యాఖ్యానాలు చెయ్యగూడదు మహారాణి పరమ పతివ్రత. ఆమె శీలాన్ని గురించిన ప్రసక్తికి యిక్కడ తావేలేదు.

జగ్గ:— అబ్బో, ఏం వాదమయ్యా నీది! మహారాజు సంతాన హీనుడు. మహారాణి శీలవతి. అయితే యువరాజు చిక్క-రాయలెవడు? అతడేమైనా ఆకాశం నుంచీ ఊడిపడ్డాడా?

స్వామి:— ఆకాశం నుంచీ ఊడిపడడానికి అతడేమీ పిడుగుకాదే! ఇంకొకడి కొడుకు మాత్రమే!

జగ్గ:— మాటలు జాగ్రత్తగా రానీ! రాజవంశ సాంప్రదాయాన్ని గురించి ఎగ్గు పలికావో, నీ నాలుక చీలికలవుతుంది.

స్వామి:— ఇక్కడ రాజవంశ సాంప్రదాయానికి వచ్చిన దొసగే

ముంది నాయనా? ఇదంతా రాజవంశం పైన జరిగిన కుట్ర. సింహాసనార్హతను తన్నుక పోవడం కోసం ఒక కుటిలుడు పన్నిన పన్నాగం.

(జగ్గరాజు నిర్ఘాంతపడిపోతున్నాడు. నోట మాట పెకలడంలేదు. తదేకదృష్టితో సన్యాసివైపు చూస్తున్నాడు. అతడు తేరుకోడానికి కొద్ది క్షణాలు పట్టింది.)

జగ్గ:— ఓరి మాయావీ! కట్టుకథలు చెబుతున్నావట్రా!

స్వామి:— కాదు నాయనా! ఒక్కొక్కప్పుడు కట్టు కథలకన్నా నిజమైన జీవితకథలే చిత్రంగా వుంటాయి

జగ్గ — ఓరి మాటలు నేర్చిన బూటకపు సన్యాసీ! ఏమిట్రా ఆ నిజమైన జీవితకథ? ఆ నిజమైన జీవితకథ నీకొక్కడికి మాత్రమే ఎట్లా తెలిసిందిరా?

స్వామి:— మేము యోగులం నాయనా! అతీంద్రియ జ్ఞానం కలిగినవాళ్లం. అవులించగానే ప్రేవులు లెక్కపెట్టగలం. ముఖం చూడగానే సర్వమూ గ్రహించగలం. దివ్యదృష్టి వలన మా కందరాని విషయమే లేదు.

జగ్గ:— నీ దివ్యదృష్టి బండారమేమిటో యిప్పుడే బట్టబయలు చేస్తాను. ఇందాకా కుట్ర, కుతంత్రమంటూ బుకాయించావే! అదేమిటి?

స్వామి:— బాగుంది నాయనా! అలా అడిగి తెలుసుకోవడం బుద్ధిమంతుల లక్షణం. మహారాణి అమాయికురాలు. ఆమె అమాయకత్వాన్ని ఆసరాగా చూచుకొని కుత్సితుడైన రాజబంధువొకడు కోటలో పాగావేయాలని ఉంకించాడు. రాణీగారిని ఒప్పించి, ఆమె గర్భవతైనట్టు వార్త పుట్టించాడు. యుద్ధ యాత్రల్లో వున్న ప్రభువులవారికి ఆ వార్త చేరవేయించాడు. నవమాసాలు నిండినవనిపించాడు. ప్రసవం గూడా అయిందనిపించాడు.

అంతా హుళక్కి. ఎక్కడినుంచో ఒక బిడ్డను తీసుకొచ్చి రాజ సంతానంగా కోటలో ప్రతిష్ఠించాడు. చేస్తేచేశాడ నుకో! తుచ్ఛమైన గ్రామసింహం గంభీరమైన పార్యాత మవుతుందా?

(అందాకా రకరకాల ముఖ కవళికలతో ఎలాగో భరిస్తూ వచ్చిన జగ్గరాజులో ఓపిక నశించింది. తటాలున చెయ్యి సాచి గొంతుక బిగబట్టి సన్యాసి నోరు మూసేస్తాడు. సన్యాసి ఉక్కిరి బిక్కిరై పోతూ జగ్గరాయల ముఖంలోకి చూస్తున్నాడు.)

జగ్గ— (వికటంగా) ఓరి అవధూతస్వామీ!

స్వామి:— (వింటున్నట్టుగా తలపంకిస్తాడు.)

జగ్గ:— నీకు నేలపైన నూకలు చెల్లిపోయాయి.

స్వామి:— (అంగీకరించినట్టుగా తలాడిస్తాడు)

జగ్గ:— నువ్వు బైరాగివి కావు.

స్వామి:— ..........

జగ్గ:— అవధూతవుగావు.

స్వామి: —... .... ....

జగ్గ:— ఎవరు నువ్వు? నిజంచెప్పు. ఎవడివినువ్వు? (పట్టుసడలిస్తాడు. నోరు సన్యాసి స్వాధీనానికి వస్తుంది.)

స్వామి:— వికట ప్రలాపాలు, వికృత ప్రవర్తనలూ మంచివిగావు నాయనా!

జగ్గ:— (ఒక నిర్ణయానికి వచ్చినట్టు) నువ్విలా చెప్పవులే! (సన్యాసి ఎదుట భూమిలో పాతివున్న త్రిశూలాన్ని ఊగించిపైకి లాక్కుంటాడు) ఏమిటిది? నీ కపట వేషానికొక హంగుగా ఉపకరిస్తూ వచ్చిన త్రిశూలంగదా! ఇది నీ చేత నిజం చెప్పిస్తుంది. (త్రిశూలాన్ని సన్యాసి గుండెల పైన మోపి) చెప్పు శూలాగ్రం గుండెలోకి చొచ్చుక పోక మునుపే చెప్పు. నువ్వెవడివి!

స్వామి:— (తెగించినట్టుగా) నేనెవరినైతేనేమిరా జగ్గరాజా! నిన్ను గురించిన నిజం లోకానికి వెల్లడైంది. నిజం నిప్పు వంటిది. ఆ నిప్పు నిన్ను కాలుస్తుంది.

జగ్గ:— ఇప్పుడీ క్షణంలోనే నీ జీవితం బుగ్గి కాబోతూవుంది.

జగ్గ:— నా జీవితాశయం నెరవేరిన తర్వాత నేనేమైపోతేనేమిరా పాపాత్ముడా? అంతఃపురంలో జరుగుతున్న అంతర్నాటకాన్ని పసిగట్టిందన్న కారణాన ఎవడి అర్ధాంగినైతే నువ్వు హత్యచేయించావో, తిరుగుబాటుకు పథకాలు వేస్తున్నాడన్న అభాండం మోపి ఎవడినైతే రాజాగ్రహానికి గురిచేశావో. గుండెల్లో ఆరనిచిచ్చు రగులుకొల్పి ఎవడినైతే దేశాల పాలుచేశావో - ఆ తిరుమలరాయణ్ణిరా నేను! చంపుకోరా భ్రష్టుడా!

(కెవ్వున కేక వినిపిస్తుంది. 'స్వామీ! స్వామీ?' అంటూ రంగభట్టు రంగంపైకి పరుగెత్తుకొస్తాడు. రక్తసిక్తమైన శూలంతో యమభటుడిలా నిలబడివున్న జగ్గరాజును చూడగానే అతనికి మతిపోతుంది. ప్రాణభయంతో పరుగు లంకించుకుంటాడు)

( తెర )

# 5

[స్థలం: తిరుమలపైన ఆలయ సమీపంలోవున్న పూల తోట. పగటివేళ. రంగభట్టు ఓ శిలావేదికపైన ముసుగుదన్ని పడుకొని వున్నాడు. చలి జ్వరానికిలోనైనట్టు ముసుగు లోపల అతడు గజగజా వణకిపోతున్నాడు. ఇంతలో తెరపై నుంచీ త్రిశూలం నీడ అతనివైపు ప్రసరించడం ప్రారంభమవుతుంది. కెవ్వున ఒకసారి కేక పెట్టి అతడు జ్వరంలో ప్రలాపించినట్టుగా ప్రారంభిస్తాడు.]

భట్టు.— వద్దు. నన్ను చంపొద్దు నా జోలికిరావద్దు. నేను అవధూత స్వామినిగాను.... ఒక కవిని, పదాల గారడీతో పద్యాలల్లుకొని బ్రతికేవాణ్ణి. నాపైన నీకెందు కమ్మా ఆగ్రహం? వెళ్లిపోవే త్రిశూలమా! వెళ్లిపో. నువ్విలా వెళ్లేటట్టు లేవు. ఉండు చెబుతాను.

గోష్పదీ కృత వారాశిం
మశకీ కృత రాక్షసాం
రామాయణ మహామాలా
రత్నంవందే అనిలాత్మజం॥

(బిగ్గరగా శ్లోకాన్ని ప్రారంభించగానే త్రిశూలం నీడ మాయమై పోతుంది రంగభట్టు రెండు మూడు సార్లు శ్లోకాన్ని 'రిపీట్' చేస్తాడు. క్రమక్రమంగా స్వరం హీనమై వినిపించకుండాపోతుంది. మళ్లీ తటాలున త్రిశూలం నీడ కానరావడంతో ఎగిరిపడి, మరింత బిగ్గరగా హనుమద్దండకాన్ని మొదలంకించుకుంటాడు.)

శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్య కాయం....

(సమయానికి దండకం గూడా జ్ఞప్తికి రాలేదు. అందువల్ల అదే మాటల్ని మళ్లీ మళ్లీ వల్లిస్తున్నాడు. గుడి నుంచీ పూలసజ్జతో, పూజాద్రవ్యాలతో తిరిగివస్తున్న రంగ నాయకి అలికిడి వినిపించగానే ఆగిపోతుంది.)

రంగ:— ఎవరక్కడ? (పోల్చుకొని) ఏమయ్యా రంగభట్టూ! శృంగార సంకీర్తనం గదా నీ వృత్తి! ఆంజనేయులవారితో నీకేమవసరం వచ్చిందయ్యా?

భట్టు:— ఏ పాపంచేశానో, ఎవరి శాపం తగిలిందో రాత్రికి రాత్రే చలిజ్వరం ముంచుకొచ్చేసింది.

రంగ:— పాపాలకు, శాపాలకు చలి జ్వరమేనటయ్యా వచ్చేది?

భట్టు:— వట్టి చలిజ్వరం కాదే భయజ్వరం గూడా! త్రిశూలం.... కళ్లు తెరిచినా, కళ్లు మూసినా ఒక త్రిశూలం. నీ కళ్లు పొడిచేస్తాను. నీ గుండె చీరేస్తాను.... అంటూ నా ప్రాణాలను ఒలుచుకు తినేస్తూవుంది.

రంగ:— త్రిశూలమా? (జ్ఞప్తికి వచ్చినట్టు) జాబాలి తీర్థం దాపున - అవధూతస్వాములవారిని ఎవరో త్రిశూలంతో పొడిచి చంపేశారని అనుకుంటున్నారే! అదేనా!

భట్టు:— అమ్మమ్మ! ఆ మాట మాత్రం ఎత్తొద్దు. గుండెల్లో గుచ్చుకున్నది గుచ్చుకున్నట్టేవుంది. అవధూత బొండ మానులాక్రింద పడివున్నాడు. బండపైన తడి రక్తం మడుగుకట్టింది. ఆ దృశ్యాన్ని తలుచుకుంటే చాలు. బొండలోని నా ప్రాణం పంజరంలో చిలకలా విలవిల లాడి పోతూవుంది.

రంగ:— అంత దగ్గరినుంచీ చూచావన్న మాట?

భట్టు:— చూడబట్టేగదా ఈయాతన! ఏ మంత్రమో, తంత్రమో

చేయించుకుందామని భూతవైద్యుడి కోసం బయల్దేరాను. ఇక్కడికొచ్చేటప్పటికి నడిచే ఓపిక గూడా లేకపోయింది.

రంగ:— (ఆలోచిస్తూ) ఏమయ్యా రంగభట్టూ! ప్రభువులవారు కొండపైన స్వామిసన్నిధిలో విడిదిచేసి వుండగానే ఎంత ఘోరం జరిగి పోయిందో చూచావా?

భట్టు.— విడిది చేయడం మాత్రమే నా? ప్రభువులవారు అవ ధూతను దర్శించి యిలా వెలుపలికి వచ్చారో లేదో, హంతకుడలా లోపలికి చొచ్చుకుపోయాడు. అదే విడ్డూరం!

రంగ:— వాడికేదో అనుమానం కలిగింది. ప్రభువులవారిని వెంబండించాడు. అవధూతతో ఆయన సల్పిన ప్రసంగం విన్నాడు. ఆ ప్రసంగంలో వాడికిబ్బంది కలిగించే అంశ మేదో బయటపడింది. అవకాశం దొరకగానే లోపలికి వెళ్లి సన్యాసిని హత మార్చేశాడు. ఇంతకూ వాడెవడై వుంటాడో నువ్వూహించలేవటయ్యా రంగభట్టూ....

భట్టు:— ఊహించడ మేమిటమ్మా తల్లీ, కళ్లముందర కనిపించి నట్టేవుంటే....

(ఓ పూలమొక్క చాటునుంచీ జగ్గరాజు ఆకారం ఈవలికి వచ్చి నిలబడింది. తీసుకొన్న కఠోర నిర్ణయంవల్ల రాక్ష సరూపం ధరించినట్టున్న జగ్గరాజును చూడగానే రంగ భట్టుకు మతిపోయినట్టయింది మునుపటి కన్నా తీవ్రంగా అతడిప్పుడు కంపించిపోతున్నాడు. అతడి పెదవులు తడి లేని ఎండుటాకుల్లా కదులుతున్నాయి. ఈ హఠాత్పరి ణామానికి కారణమేమిటో రంగనాయకికి మాత్రం తెలియడంలేదు. ఆమె రంగభట్టు వైపుకు తిరిగి నిల్చో డం వల్ల వెనుకవైపున నిల్చున్న జగ్గరాజు కనిపించడం లేదు.)

రంగ.— చెప్పు.... ఎలావుంటాడు వాడు?

భట్టు:— (నూటిగా, భయంభయంగా జగ్గరాజు ఆకారాన్ని వర్ణిస్తూ) మిడిగ్రుడ్డు.... గద్దముక్కు.... కోర మీసాలు .... అమ్మో, దూతదర్శనం (పడుతూ లేస్తూ పారి పోతాడు. ఈలోగా జగ్గరాయలు పొలకువను గుర్తిం చిన రంగనాయకి రంగభట్టు భయపడి పారిపోవడానికి కారణమేమిటో గ్రహిస్తుంది)

రంగ:— సుస్వాగతమండీ జగ్గరాయలవారూ! రండి రండి. దయ చేయండి. ఈ రోజెవర్ని వెంటాడుతున్నారో, ఎవర్ని వేటాడదలచుకున్నారో సెలవివ్వండి.

జగ్గ:— (ముఖకవళికలు మార్చుకొని. భగ్న ప్రేమికుడి బాణీలో) రంగనాయకీ! బ్రతుకంతా నిన్ను గురించిన తలపులే నన్ను వెంటాడుతున్నాయి. జీవితమంతా నీ వాలు చూపులే నన్ను వేటాడుతున్నాయి. ఇటీవల కొన్ని సంవత్సరాలుగా నీకైతే నా పైన బొత్తిగా దయలేకపోయింది.

రంగ:— జగ్గరాయా! పీడకల లాంటి గతాన్ని త్రవ్వి, ఆచెత్తా చెదారంతో నాకభిషేకం చెయ్యవద్దు.

జగ్గ:— నువ్వు దేన్నయితే పీడకలగా భావిస్తున్నావో, అది నీ పాలిటికొక మధురస్మృతిగా మారిపోయే రోజు - అచిరకాలంలోనే వుందిలే, రంగనాయకీ! ఇప్పుడు విష ముష్టికాయలాతోచే నా మాట, అప్పుడు నీకు కండ చెక్కరకన్నా తియ్యగా వుంటుంది. ఇప్పుడు వెక్కసంగా తోచే నా నవ్వు, అప్పుడు నీకు పన్నీటి జల్లులా వుంటుంది ఇప్పుడు అసహ్యంగాతోచే నా సాన్నిధ్యం అప్పుడు నీకు బ్రహ్మానంద పదవిగా వుంటుంది.

రంగ:— ఎందుకులే జగ్గరాయా! నువ్వు ఆడదానికిచ్చే విలువే

మిటో నాకు తెలియదా? నీ దృష్టిలో ఆడది భోజనం చేసిన తరువాత మిగిలే ఎంగిలాకు. నువ్వేవూళ్లో అడుగుపెట్టినా, ఏ వీథిలో పచారు చేసినా, ఏ కొత్త కబురు చెవిలోపడినా - ఒక ఆడది నీకబంధ హస్తాల్లో చిక్కినట్లే; ఆ రాత్రికి దాని శీలం నట్టేటిలో కలిసినట్లే. అటువంటి వందలాది అభాగ్య వనితల్లో ఈ రంగనాయకి ఒకతె. అంతకుమించిన ప్రత్యేక పరిగణన ఒకటి ఏదో నాకే ఉన్నట్లు, నువ్వు ప్రత్యేకించి నాతలలోనే ఒక కలికి తురాయిని చెక్కినట్టు - ఈ నయగారాలూ. మాయ మాటలూ ఎందుకు చెప్పు!

జగ్గ:— కడుపు చించుకున్నా గారడీ విద్యేనంటే ఎలా రంగనాయకీ? నేను కొంతకాలమైనా నిలకడగా గడిపింది నీతోనే గదా?

రంగ:— అవునయ్యా జగ్గరాజా! ఆ లెక్కన నేను ఎంగిలికంచాన్ని, అంతేగదా?

జగ్గ:— పోనీ. నాపట్ల నీకు సద్భావం కలగాలంటే ఏంచెయ్యాలో చెప్పవా రంగనాయకీ?

రంగ:— సద్భావమనేది కొంచెమోన చమో వుండివుంటే, అది ఈనాటితో పూర్తిగా తుడిచిపెట్టుకపోయింది. ఇంత కాలంగా నువ్వు అదృష్టం వరించిన ఆడవాళ్ల పాలిట కీచకాధముడివి మాత్రమే ననుకున్నాను. స్వప్రయోజనం కొరకు తిన్నయింటి వాసాలు లెక్కపెట్టే స్వార్థపరుడివి మాత్రమే ననుకున్నాను, కందమూలాలు తింటూ సెలయేటి నీళ్లు త్రాగుతూ, కొండగుహల్లో తపసు చేసుకునే సాధు పుంగవుల్ని పొట్టన బెట్టుకునేటంత వరకు నీలో కిరాతకత్వం విజృంభించిందని యిప్పుడే తెలిసింది.

జగ్గ:— చూడు రంగనాయకీ!

రంగ: - ఇంక చూడడాని కిక్కడేముంది? కుబుద్ధులవల్ల, కుచ్ఛితులవల్ల, కుట్రదారులవల్ల వేంకటపతిరాయలవారు జీవించి వుండగానే దేశం వల్లకాడుగా మారింది.

జగ్గ: — నేనుచెప్పేది గూడా వినిపించుకో రంగనాయకీ! కవికాకి రంగభట్టు వట్టి వదరుబోతు - అయినా వాడినోరు మూయించడం నాకు చిటికెలోపని కానీ వాడితో వ్యవహారించినట్టుగా నేను నీతో వ్యవహరించలేను. బూడిద బుంగదైన ఒక బైరాగిని నేను చంపవలసి వచ్చిందంటే అందుకు ప్రబలమైన కారణంవుంది.

రంగ:— ఏమిటది?

జగ్గ: — చెప్పమంటావా రంగనాయకీ! కానీ నువ్వునాకొక మాట యివ్వాలి. ఎట్టి పరిస్థితిలోనూ ఈ విషయం నీ మూలంగా బయటికి పొక్కగూడదు.

రంగ:— జగ్గరాయా! నీ ఎత్తుగడ లేమిటో నాకు తెలియదు నేను నీ చేతిలో ఒక పాచికగా వుండడానికి మాత్రం సుతరామూ అంగీకరించలేను.

జగ్గ: — నీకు తెలియదుగానీ రంగనాయకీ, నా ఎత్తుగడగానివ్వు నా ప్రయత్నంగానివ్వు, నా జీవిత లక్ష్యంగానివ్వు - అదంతా నా ఒక్కడి కోసం మాత్రమేగాదు - నీకోసం గూడా! నువ్వొక దానివి నా కండగా నిలిస్తేచాలు, మన ఆశాసౌధాల నిర్మాణం పరిపూర్ణ మవుతుంది,

రంగ:— ఎగతాళి చేస్తున్నావా జగ్గరాయా! నా బ్రతుక్కు నాకు ఆశలూ, సౌధాలూ కూడానా! కనుచూపుకైనా నోచుకోకుండా కన్నబిడ్డనేనాడైతే కోల్పోయానో, ఆనాడే నా జీవితాశ అడుగంటింది.

జగ్గ — లేదు రంగనాయకీ! ఆశ అడుగంట లేదు.... అది ననలు తొడిగింది. కొనలు సాచింది. ఏపుగా పెరిగి పందిరి కెక్కింది.

రంగ:— (నిర్ఘాంతపడిపోయింది. అయోమయంలో ఏం చెప్ప డానికీ తోచడంలేదు) జగ్గరాయా! నువ్వు.... నువ్వు...

జగ్గ:— అవును రంగనాయకీ! నేను చెప్పేది నిజం! నీ బిడ్డ చని పోలేదు.

రంగ:— నా బిడ్డ.... నా బిడ్డ చనిపోలేదా? జీవించేవున్నాడా? ఎక్కడున్నాడు? ఎలా వున్నాడు? బిడ్డ జీవించివుండి గూడా నేనింతకాలం జీవచ్ఛవంలా జీవించానా? ఎందుకు? ఎందుకు? ఏ నేరం చేశానని నాకీశిక్ష?

జగ్గ.— శిక్షేకావచ్చు. కానీ శిక్షకు గురిగాకపోతే గొంగళి పురుగు సీతాకోకచిలుకగా మారుతుందా? దేవదాసి రంగనాయకి రాజమాత రంగనాయకిగా మారడం మంటే - అది సామాన్యమైన విషయమా రంగనాయకీ?

రంగ:— జగ్గరాయా! ఏమిటీ?! నువ్వనేదేమిటి? నేను రాజ మాతనా? ఎలాగవుతానయ్యా నేను రాజమాతగా?

జగ్గ:— నెమ్మదిగా విను రంగనాయకీ! మహారాణి గర్భవతైవుండ నడం అబద్ధం గర్భందాల్చిందీ, బిడ్డను ప్రసవించిందీ నువ్వు చనిపోయినట్టుగా నువ్వు భావించిన నీ బిడ్డ అంతఃపురం లో మహారాణి సంతానంగా పెరిగి పెద్దవాడయ్యాడు ఇంకా అర్థం కాలేదా రంగనాయకీ? యువరాజు చిక్క రాయలే నీ....

రంగ:— వద్దు, ఆ వాక్యాన్ని పూర్తి చెయ్యొద్దు. ఒక తల్లి కామె బిడ్డను దక్కకుండాచేసి, పెంచిన రాజదంపతులకు వాణ్ణి గుండెలో ముల్లుగా తయారుచేసి, చివరకు వాణ్ణి కన్న తల్లి నే కొంగుపట్టుకులాగే ఘోరపాతకుణ్ణిగా రూపొం దజేసి, ఇప్పుడీనాడు వాడే నీ కొడుకని చెప్పడాని కొచ్చావా? ఛీఛీ నువ్వు మనిషివై వుండవు. నరరూప రాక్షసుడివై వుంటావు. నీది హృదయమైవుండదు -

కటిక పాషాణమైవుంటుంది. నీది నోరైవుండదు. రొచ్చుగుంటై వుంటుంది.

జగ్గ:— చిరంజీవి చిక్కరాయలు పడుచువాడు. ఆ వయసులో ఎవరికైనా కొంత దుడుకుతనం సహజం....

రంగ:— కొంత దుడుకుతనమా? కళ్లుకానని కామావేశం, కండకావరంతో కారు కూతలు ప్రేలడం, కైపెక్కేట ట్టుగా తినీ, త్రాగీ తైతక్కలాడడం. కొంతదుడుకు తనమా? కాదు కానే కాదు. అది కొండంత ఆకతాయి తనం.

జగ్గ:— ఏమైనా కానివ్వు! కొడుకు శ్రేయస్సుకోరడం తల్లి ధర్మం!

రంగ:— జగ్గరాయా! ఈ కల్లబొల్లి మాటలతో నువ్వు నన్ను మోసగించలేవు. కన్నబిడ్డను కళ్లారాచూచుకోలేకపో యిన దౌర్భాగ్యానికి కుమిలిపోతూ నేనెన్నిరాత్రులు నిద్రలేకుండా గడిపానో లెక్కలేదు. కానీ యిప్పుడీ ఋణాన చెబుతున్నాను. ఇలాంటి బిడ్డకు తల్లినిగావడం కన్నా ఏడేడు జన్మలు గొడ్రాలుగానైనా పుట్టించమని భగవంతుణ్ణి వేడుకుంటాను. నేను కన్నతల్లినై తేగావచ్చు కానీ వాడు నా బిడ్డకాదు. మహారాణి పెంపుడు తల్లి కావచ్చు - కానీ వాడామె బిడ్డకాదు. జగ్గరాయా వాడు నీబిడ్డ. నీ బిడ్డగా వాడు సానివాడలకు సరదా రుడుగా వుండనీ! నీ బిడ్డగా వాడు ధూర్తశిఖామణులకు దొరగావుండనీ! నీ బిడ్డగా వాడు పాపాల దర్బారులో పాళేగాడుగా వుండనీ! అంతేగానీ ఆరవీటి రాజవంశం మాత్రం వాడివల్ల కళంకితం కాగూడదు. వాడి నీడ చంద్రగిరి సామ్రాజ్య సింహాసనం పైనపడగూడదు.

జగ్గ:— రంగనాయకీ! నిన్ను నమ్మి నేను రహస్యం వెల్లడించాను నువ్వు నా నమ్మకాన్ని వమ్ముచేస్తున్నావు.

రంగ:— నా బొందిలో ఊపిరనేది వుండేంత వరకూ నేనాపనే చేస్తాను.

జగ్గ:— ఆపని చేయదలచుకున్నట్టయితే - నీ బొందిలో ఊపిరుండదు.

రంగ:— నాకు ప్రాణాలంటే మోజులేదు. కానీ నీ చేతిలో చచ్చే నికృష్టపు చావుకు మాత్రం ఒప్పుకోను.

జగ్గ:— ఒప్పుకోక ఏంచేస్తావు? ఈ క్షణాన నేను చంపతలచుకుంటే నిన్నెవడు రక్షిస్తాడు?

రంగ:— వేంకటాచలపతిపైన నాకు విశ్వాసం వుంది. ఆయనే రక్షిస్తాడు.

జగ్గ:— (సమీపిస్తూ) ఏదీ రక్షించమను చూద్దాం....

(రెండు చేతులతోను గొంతు నులుముతున్నాడు. రంగనాయకి గింజుకుంటూ కెవ్వనకేక పెడుతుంది. ఎవరో వస్తున్న అలికిడివిని జగ్గరాజు రంగనాయకిని అలాగే వదిలి పారిపోతాడు.

చుట్టూ కలయజూస్తూ శ్రీరంగరాయలు రంగంపైకి ప్రవేశిస్తాడు.)

శ్రీరంగ:— ఏమైంది రంగనాయకీ! ఏం జరిగింది?

రంగ:— (మాట్లాడదు. మనిషిలో చలనంలేదు. రెప్పకదలని కళ్లు మాత్రం శ్రీరంగరాయలవైపు చూస్తున్నాయి.)

శ్రీరంగ:— గుడిలోపలికి వెళ్తుండగా మూడో వాకిలి దగ్గర నువ్వెదురయ్యావు. ఈ పాటికి విడిది చేరుకోవలసింది. మార్గ మధ్యంలో యిక్కడేం జరిగిందో చెప్పవూ?

రంగ:— ఏం చెప్పమంటారు? రాజ్యంలో మాన ప్రాణాలకు భద్రతలేని పరిస్థితి ఏర్పడింది.

శ్రీరంగ:— ఎందువల్ల? ఎవరివల్ల?

రంగ:— ఆ విషయం తెలిసి ఏంచేస్తారు? అన్యాయాన్ని అరికట్టడానికి మీరు సిద్ధంగా వున్నారా?

శ్రీరంగ:— ఇప్పుడంతగా ముంచుకొచ్చిన ఉపద్రవమేమిటో చెప్పవేం రంగనాయకీ?

రంగ:— ఉపద్రవంపుట్టి ఇరువదేళ్లయింది. అది రాచనగరులోనే పెరిగి పెద్దదయింది.

శ్రీరంగ:— రాచనగరులో ఉపద్రవమా? ఏమిటది?

రంగ: – దాని పేరు చిక్కరాయలు.

శ్రీరంగ:— యువరాజు చిక్కరాయలా? అతడు రాజ్యానికి ఉపద్రవమని చెబుతున్నావా? నీకేమైనా మతిపోయిందా రంగనాయకీ?

రంగ:— చిక్కరాయలు యువరాజు కాదు.

శ్రీరంగ— ఎందుకని?

రంగ:— రాజదంపతుల సంతానం కాదు గనుక!

శ్రీరంగ:— (తలదిమ్మదిరిగినట్టు) రంగనాయకీ!

రంగ:— మొదటి పొరబాటు మహారాణిది. ఆమె కుట్రకు తల ఒగ్గింది. గర్భవతిగా వున్నట్టు నటించింది. ఆమె గర్భవతి కానూ లేదు. ప్రసవించనూ లేదు.

శ్రీరంగ.— మరైతే బిడ్డ?

రంగ:— వాడింకొకరి బిడ్డ

శ్రీరంగ:— ఇదంతా వట్టి కట్టుకథ కాగూడదా రంగనాయకీ?

రంగ:— నిరూపించడం నా చేతనౌను.

శ్రీరంగ:— కానీ ఈ విషయం బహిర్గతమైతే రాజకుంటుంబం యొక్క పరువూ ప్రతిష్ఠామంట కలిసిపోతుంది. మహారాణి తలవంపులకు గురవుతుంది. మహారాజు గుండె వ్రయ్యలవుతుంది.

రంగ:— ఏది ఏమైనాసరే, కనకపు సింహాసనం శునకం పాలు మాత్రం కాగూడదు.

శ్రీరంగ:— రంగనాయకీ! ఈ వయసులో మహారాజుకు మన శ్శాంతి లేకుండా చేయడం మనకు ధర్మమా? కనీసం ఆయన జీవించి వున్నంతవరకైనా ఈ రహస్యాన్ని రహస్యంగా వుంచలేమా?

రంగ:— మళ్లీ ఒకసారి చెబుతున్నాను. మీనమేషాలు లెక్క బెడుతూ కూచుంటే వ్యవహారం చెయ్యిదాటిపోతుంది?

శ్రీరంగ — ఏమైనా సరే! రాజకుటుంబం ప్రతిష్ఠకోసం, మహారాణి గౌరవంకోసం, మహారాజు మనశ్శాంతికోసం మనం కొంత ఓపిక వహించక తప్పదు.

రంగ:— మనం మనమంటూ నన్ను కలుపుకోకండి. ఈ రాజ్యంలో నా ఉనికి తాత్కాలికం. నాకున్న గడువు కొద్ది రోజులే. అయితే ఒకటి. ఆ లోపల పరరాజ్యానికి బదులుగా, పరలోకానికి ప్రయాణం గట్టవలసి వచ్చినా ఆశ్చర్యంలేదు.

శ్రీరంగ:— రంగనాయకీ! నీ ధోరణిగానీ, అంతర్యంగానీ నాకు బొత్తిగా బోధపడడంలేదు. చాలా నీరసంగా వున్నావు. ప్రస్తుతం నీకు విశ్రాంతి అవసరం. వెళ్దాంపద, నిన్ను నీ విడిది దగ్గర దిగబెడతాను.

రంగ:— అలాగే ప్రభూ!

( రంగనాయకి ముందుకు నడుస్తుండగా తెర )

# 6

[స్థలం: మొదటి అంకంలో మాదిరిగా చంద్రగిరి నగరం లోని రాజప్రాసాదం. వేంకటపతిరాయలవారు పెరిగిన గడ్డంతో పర్యంకంపైన పడుకొనివున్నారు. మహారాణి సపర్యలు చేస్తూ పర్యంక సమీపంలో వుంటుంది]

మహా:— ప్రభూ! కొంచెం పాలూ, పండ్లూ....

వేంకట:— (వద్దన్నట్టు తలపంకిస్తాడు)

మహా:— ఇలా నిరాకరిస్తే ఏలాగు ప్రభూ! జబ్బేమీ లేదని రాజవైద్యులన్నారు గదా! భోజనం చేసి, హాయిగా నిద్రిస్తే ఆరోగ్యానికేమీ సేగి వుండవని కూడా అన్నారు గదా! పోనీ, ఈ గోక్షీరమైనా పుచ్చుకోరూ?

వేంకట:— (మళ్లీ అదేవిధంగా నిరాకరిస్తాడు)

మహా:— ఎన్నిమార్లు పలకరించినా యిలా మూగనోము పడుతున్నారు. అనవరతం అలా ఆలోచిస్తూ, ఆలోచిస్తూ కాలం గడిపేస్తున్నారు, ఆహారం బొత్తిగా త్యజించారు. మనం కొండ దిగివచ్చి ఈ నాటికి పదిరోజులైంది. అప్పటినుంచీ యిదే పరిస్థితి ఇంతకూ, యింత తీవ్రంగా తమను వేదిస్తున్న విషయమేమిటి ప్రభూ?

వేంకట:— (అయోమయంగా మహారాణి వైపు తేరిపార జూస్తున్నాడు)

మహా:— వద్దు వద్దొద్దు. అలా చూడకండి ప్రభూ! తమరలా చూస్తే దిగులు భయమూ, ఆందోళనా నా మనసులో ముప్పిరి వేసుకుంటాయి. ఏందుకునన్నిలా శిక్షిస్తున్నారు? నేనేమైనా తప్పిదంచేసి వుంటే సెలవివ్వండి ప్రభూ!

వేంకట:— ఒకరి తప్పిదాలను ఒకరు ఎత్తిచూపడం వల్ల జరిగేదే ముంటుంది. మహారాణీ! ఎవరి తప్పిదాన్ని వాళ్లే గ్రహించాలి. గ్రహించి, దానివల్ల ఏర్పడే అనర్థాన్ని నివారించడానికి ప్రయత్నించాలి.

మహా:— అవధూతస్వాముల వారిని దర్శించినప్పటినుంచీ తమలో ఊహించడానికి వీలుకాని మార్పేదో వచ్చింది. అదే మీటో చెప్పగూడదా ప్రభూ!

వేంకట:— ఎందుకులే మహారాణి! కడుపు చించుకుంటే కాళ్ళ పైన పడుతుంది. ఎంతటి రహస్యమైనా పెదవిదాటితే పెన్నదాటుతుందంటారు. అంతఃపుర రహస్యాలు వడి వీధి పాలుగావడం మాకిష్టంలేదు కానీ మనలో మనకు కలిగే అనుమానాలవల్ల కానివ్వు - మన జీవితాల్లో దాగివున్న రహస్యాల వల్ల కానివ్వు - మనమిద్దరం మాత్రమే కష్టనష్టాలకు గురైతే అందుకు నేను చింతించను. వాటిమూలంగా రాజ్యక్షేమానికి భంగం, రాజ్య ప్రజలకు అరిష్టం వాటిల్లగూడదు. ఈ అవసానదశలో ఆ ఒక్క నమ్మకం కలిగితేచాలు - మేము నిశ్చితంగా కళ్లు మూయడానికి అంతకంటే కోరేదేమీలేదు.

( ప్రవేశం - కంచుకి )

కంచుకి:— ప్రభువులవారికి శతకోటివందనాలు. యాచమనాయకులవారు తమ అనుమతికోసం వేచివున్నారు.

వేంకట:— వారిని ప్రవేశపెట్టు.

కంచుకి:— చిత్తం (నిష్క్రమణ)

వేంకట:— (స్వగతంగా చెప్పుకున్నట్టు) అంధకారంలో ఒక్కటే ఆశాకిరణం! మనసు తెలిసినవాడు - మేలుకోరేవాడు -మంచి చేసేవాడు అయిన మిత్రుడు జన్మకల్లా ఒక్కడు మాత్రమే లభిస్తాడేమో!

యాచమ:— (ప్రవేశించి) ప్రభువు:కు ప్రణామాలు.
వేంకట:— రండి. రండి. ఆసీనులుకండి.
యాచమ:— (సమీపిస్తాడు కానీ కూర్చోడు. ఏదో అడగదలచు కున్నాడు అడగలేదు.)
వేంకట:— అడగండి తటపటాయిస్తారెందుకూ?
యాచమ — అదే ప్రభూ! తమ ఆరోగ్యం....
వేంకట:— మామూలే! మార్పులేదు అయినా కృష్ణపక్షంలో క్షీణచంద్రుని ఆరోగ్యాన్ని గురించి మీరడగనూరాదు. మేము చెప్పనూరాదు.
యాచమ— అలా అనకండి ప్రభూ! తమకారోగ్యం కొరవడి నప్పటినుంచీ రాచనగరు చీకటిలో మునిగిపోయింది, రాజధానిలో కళాకాంతులులేవు. రాజ్య ప్రజలు ఖిన్నులై దిగులుతో క్రుంగి పోతున్నారు.
వేంకట:— బంధువులు రోదిస్తారనీ, ఆత్మీయులు దుఃఖిస్తారనీ కాలం కరుణిస్తుందా! కాలనియతి అవిలంఘ్యమండీ యాచమనాయకుల వారూ! దిలీపుడు, సగరుడు, మాంధాంత, రఘువు-అటువంటివారికే తప్పలేదు. మన మెంతటివాళ్లం?
మహా:— కానీ అమంగళాన్ని మళ్లీ మళ్లీ మననం చేసుకోడం బాధాకరం కాదంటారా?
యాచమ:— నిజమే! అమంగళాన్ని గుర్తుకుతెచ్చేమాటలతో మహారాణీవారి మనసుకు నొప్పి కలిగించడం తమకు ధర్మంకాదు.
వేంకట:— మాకంటూ కొన్ని ధర్మాలుండడం వల్లనేనండీ ఈ విచారం.
యాచమ:— తమ ధర్మ నిర్వహణకేం ప్రభూ! శిష్టజనుల పాలి టికి నిండుపున్నమివెన్నెలగా, దుష్టులపాలిటికి మండు

వేసంగినాటి ప్రచండ సూర్యాతపంగా అది అప్రతిమానంగా సాగిపోయింది.

వేంకట:— నా చింత గతాన్ని గురించి కాదండీ! భవిష్యత్తు గురించి....

మహా:— భవిష్యత్తును గురించి గూడా తమరే నిర్ణయం చేయవచ్చుగదా!?

వేంకట:— చేయవచ్చు. కానీ ఒక వ్యవస్థలో ఏకపక్ష నిర్ణయాలెప్పుడూ మంచివికావు అర్ధాంగిగా మహారాణి అందుకు ఒప్పుకోవాలి. సచివులుగా యాచమనాయకుల వారందుకు సమ్మతించాలి. ఇంకా సామంతులకు, దండనాయకులకు ప్రజలందరికీ అది యిష్టమైనదై ఆమోదయోగ్యం కావాలి....

యాచమ:— అటువంటి నిర్ణయం చేయడానికి తమకంటే విజ్ఞులైన వారెవరున్నారు ప్రభూ! ఎటొచ్చీ, ఒక ధర్మసందేహం. తమరు అస్వస్థులుగా వున్న ఈ స్థితిలో ఆవిచికిత్స అంత అత్యావసరమా అని....

వేంకట:— అత్యావసరం కాబట్టే ఈ ప్రసక్తి తేవలసి వచ్చింది. అవధూత స్వాములవారిని దర్శించి, మన ఈవలికి రాగానే ఆయననెవరో హత్యచేశారు. హంతకుని జాడ తెలిసిన చిన్నస్వామిగానీ, రంగభట్టుగానీ కంటి కందకుండా తెరవెనుక వుండిపోయారు. మనం కొండదిగి వచ్చేటప్పటికి దుర్గంలో బందీగా వుండిన జింజి కృష్ణప్పనాయకుడు మూసిన తలుపులు మూసినట్టుండగానే మటు మాయమైపోయాడు. ఈ పరిణామాలను బట్టి మీరేమనుకుంటున్నారో మాకు తెలియదు. కానీ మేము మాత్రం ఒకస్థిరనిర్ణయానికి వచ్చేశాము.

యాచమ:— (కొద్ది క్షణాలు ఆగి) సెలవివ్వండి ప్రభూ!

వేంకట.— జరాభారం వల్లనైతేనేమి రుజాగ్రస్తులం కావడం

వల్లనైతేనేమి సామ్రాజ్యాధికారం మాకు తలకు మించిన బరువైపోయింది. దీని నుంచీ వెనువెంటనే విముక్తి పొందాలనుకుంటున్నాము - (కొద్ది క్షణాల విరామం) ఏమంటావు మహారాణీ! యాచమనాయకుల వారూ! మీరేమంటారు?

( గంట మ్రోగుతుంది )

అవాంతరపు గంట కదండీ! బహుశా మహామండలేశ్వర గొబ్బూరు జగ్గరాయలవారు.... అదిగో - వచ్చేశారు.

జగ్గ:— ( ప్రవేశిస్తూ ) ఆహా, ఏమిసుదినం! ప్రభువులవారు నారాక కోసం వేచిచూస్తున్నారన్నమాట! (యాచమ నాయకునివైపు చూస్తూ) ఏమండీ! ఏదైనా విశేషమా?

వేంకట:— అవశ్యంగా జగ్గరాయలుంగారు వినదగ్గ విశేషమే! యాచమనాయకుల వారూ! ఆ విశేషమేమిటో మీరే వివరించండి.

యాచమ.— కొన్ని ఆంతరంగిక కారణాలను పురస్కరించుకొని ప్రభువులవారు రాజ్యాధిపత్యాన్ని వదులుకోవాలని అనుకంటున్నారు.

జగ్గ:— అబ్బో, ఎంత గొప్ప సంకల్పం! రాజ్యాధిపత్యాన్ని .... వదులుకోవాలని ప్రభువులవారు సంకల్పించడం.... నిజంగా మనకెంతో ఆనందప్రదం. రాజ్యభారాన్ని మోసి మోసి వారి తలపండిపోయింది. రాజ్యతంత్రంలో విసిగి వేసారి వారి బుర్రవేడెక్కిపోయింది. ఆ బరువు బాధ్యతలనుండి విముక్తిపొంది హరినామస్మరణతోనూ, పురాణ శ్రవణంతోనూ వారు విరామంగా కాలం గడపాలన్నదేమన కోరిక గూడ!

యాచమ:— ప్రభువుల క్షేమంపట్ల మీకున్న అక్కర, మక్కువ జగద్విదితం కదండీ జగ్గరాయలవారూ! కానీవారు

ఉన్నట్టుండి రాజ్యాధిపత్యాన్ని త్యజిస్తే ఈ రాజ్యం గతి ఏంకావాలని మీఉద్దేశం? సరంగులేని పడవలా, చుక్కాని లేని నౌకలా యిది అస్తవ్యస్తమై పోవడానికి ఎంతో కాలం పట్టదే!

జగ్గ:— అయ్యో. దానికేముందండీ! రాజ్యభారాన్ని తన భుజ స్కంధాలపైకి మార్చుకోడానికి వారసుడు లేకపోతే గదండీ మనకు బెంగ! అలాంటి ప్రశ్నే ఉత్పన్నంకాదే! సార్వభౌముల నోటినుంచీ మాట వెలువడడమే తరు వాయి. పట్టాభిషేక మహోత్సవానికి ఏర్పాట్లుచేయడానికి మనమందరమూ ఉన్నాముగదా!

వేంకట:— మంచిది. మీరీ బాధ్యతను తీసుకుంటున్నందుకు చాలా సంతోషం. న్యాయానికి సభాముఖంగానే మేము మా అభిప్రాయాన్ని తెలుపుకోవలసింది. కానీ అనారో గ్యంవల్ల ఆ అవకాశం లేకపోయింది. అందువల్ల రాజ సింహాసనానికి - అత్యంత సన్నిహితులైన మీ ముగ్గురి సమక్షంలోనే - ఈ తతంగాన్ని నిర్వహించాలని అను కుంటున్నాము - (తలగడ క్రిందవున్న పత్రాన్ని తీసి యాచమనాయకునివైపు చేయిచాస్తాడు.)

యాచమ:— (తెల్లబోయి.... లేచి.... అందుకుంటూ) ఏమిటి ప్రభూ!

వెంకట:— అనుజ్ఞా పత్రం....

జగ్గ:— (ఆనంద పారవశ్యంతో) ఆహా, ఏమిదూరదృష్టి? ఏమి దూరాలోచన! ప్రభువులవారు తమసన్నాహాల్లో తాము న్నారన్నమాట! యాచయనాయకులవారూ! ఏదీ. చక్రవర్తుల అనుజ్ఞ ఏమిటో మాకు వినిపించరూ?

యాచమ— (రాయలవైపు చూస్తాడు)

రాయలు:— (ఆమోదాన్ని సూచిస్తూ తలపంకించాడు)

యాచమ!— (చదువుతున్నాడు)

"స్వస్తిశ్రీ శాలివాహాన శకవర్షములు పదిహేను నూర్ల నాల్గవ సంవత్సరమునకు సరియగు కీలకనామ సంవత్సర భాద్రపద శుద్ధదశమి భానువాసరమైన ఈనాడు కర్ణాటక రాజ్య పునఃస్థాపనాచార్యులమైన మేము ఇందు మూలంగా యావన్మంది ప్రజలకూ తెలియజేయడమేమ నగా వయోధిక్యత మూలంగానూ, శారీరక అస్వస్థత మూలంగానూ రాజ్యపాలనా భారం నుంచీ విముక్తుల మై విశ్రాంతి పొందదలచుకున్నాము. గనుక-చంద్రగిరి దుర్గం ముఖ్యస్థానంగా, తూర్పున సముద్రము, పశ్చి మాన ఆనగొంది, ఉత్తరాన కృష్ణానది, దక్షిణాన కావేరి సరిహద్దులు గాగల ఆంధ్రసామ్రాజ్యానికి ఈనాటి నుంచీ చిరంజీవి ఆరవీటి........"

— ఇక్కడ మూడో నాలుగో అక్షరాలు లేవు ప్రభూ! మిగిలినవి చదువుతున్నాను.

"చిరంజీవి ఆరవీటి.... (నిలిపి) రాయలవారిని పరి పాలకులుగా నియమించడమైనది.

జగ్గ:— (ఆకస్మిక ఉద్రేకంతో బుసలు గ్రక్కుతూ) ఈ వడ్ల గింజల్లో బియ్యపుగింజ వ్యవహారమేమిటండీ బావగారూ! ఏమిటండీ మీ ఆంతర్యం? దేనికోసమైనా ఇది పన్నాగం కాదు గదా?

వేంకట:— కాదులేవయ్యా జగ్గరాయా! ఏమండీ యాచమ నాయకులవారూ! ఇందాకా మేమేమన్నామో మీకు గుర్తుందా?

యాచమ:— (కొంచెం ఆలోచించి) ఉంది ప్రభూ! ఏకపక్ష నిర్ణ యాలు తమకు సమ్మతం కాదన్నారు.

వేంకట:— అవును మరి! అనుజ్ఞాపత్రంలో అక్షరాలు లుప్తమైన

చోట ఒక పేరును ఉటంకించే బాధ్యత మీది. ఒక్కొక్క రికీ అవకాశమిస్తున్నాము.

జగ్గ:— అవకాశాన్ని ఎవరైనా దుర్వినియోగం చేస్తే కల్లోలం తప్పదని ముందుగానే హెచ్చరిస్తున్నాను.

వేంకట:— పోనీ, సద్వినియోగమంటే ఏమిటి నీ ఉద్దేశం? నీ కిష్టమైన పేరే అందరూ సూచించాలనా?

జగ్గ:— అవును, నూరుఆరైనా, ఆరునూరైనా మేరువు తల్కిందులైనా, ఏమైనా సరే - భవిష్యదాంధ్ర సామ్రాజ్యానికి చిరంజీవి చిక్కరాయలే పరిపాలకుడు. అయ్యా, యాచమనాయకులవారూ! అక్కడ చిక్క రాయల పేరు వ్రాయించండి

యాచమ:— కానీ యిక్కట బంతిలో కనిపిస్తున్న వెలితినిబట్టి మూడక్షరాల పదమైతేనే సరిపోయేటట్టుంది. ఎవరికి నచ్చిన పేరు వారు సూచించుకోవచ్చునని ప్రభువుల వారన్నారు గనుక చెబుతున్నాను. వెలితిని శ్రీరంగ రాయల పేరుతో పూరించడమే సముచితంగా వుంటుం దని నా అభిప్రాయం....

జగ్గ:— అన్యాయం. అక్రమం. కుట్ర. ద్రోహం. దీనికి నేను నా బొందిలో ప్రాణాలుండగా ఒప్పుకోను.

వేంకట:— శాంతించవోయీ జగ్గరాయా! మహారాణీవారి అభి ప్రాయమేమిటో వినాలిగదా!

జగ్గ:— సెలవిచ్చారు! అక్కగారు ఈ తమ్ముని పక్షమే వహిస్తా రని నాకు తెలుసు.

వేంకట:— భార్యా భర్త పక్షం వహించగూడదని ఎక్కడా శాసనంలేదే!

జగ్గ:— కానీ యిప్పుడిక్కడ నలుగుతున్నది ఆమె కన్నబిడ్డకు సంబంధించిన ప్రశ్న,

విన్నాణం, ఈ అనుజ్ఞాపత్రం, ఈ ఎత్తుగడ - ఇదంతా దేనికి దారితీస్తాయో నాకు తెలియదా? ఏమైనాసరే. ఇటువంటి కపట నాటకంతో నన్ను మభ్యపెట్టడం మాత్రం ఎవరి తరమూ గాదూ.

**మహా**:— ఏమయ్యా తమ్ముడూ! ఇది రాజ్యక్షేమానికి సంబంధించిన విషయంగదా! అరుపులూ, ఆర్భాటాలూ మాని కొంచెం ప్రశాంతంగా ఆలోచించలేవా?

జగ్గ — చాల్లే! నువ్వుగూడా శాంతి పన్నాలు చెబుతున్నావా అక్కయ్యా! నువ్వూ నేను జీవించివుండగానే, మన సమక్షంలో యిటువంటి వైపరీత్యం జరిగిపోతుంటే చూస్తూ ఊరుకుంటావా? పట్టపురాణివిగా వుండి, రాజమాత కావలసిన దానివి, ఆమహాద్భాగ్యాన్ని కాలదన్నుకుని, అనామకంగా - జీవచ్ఛవంగా జీవిస్తావా?

(కొన్ని క్షణాలు నిశ్శబ్దం)

వృద్ధాప్యంవల్ల మహారాజుకైతే మతి చలించి వుండొచ్చు. స్వామి భక్తి ప్రకోపించడంవల్ల - యాచమనాకులవారు దేవరవారి కిష్టమైన చిలకపలుకులే పలకొచ్చు. కానీ ఈ మూర్ఖత్వం నిన్నెలా ఆవహించిందని నేనడుగుతున్నాను.

( శ్రీరంగరాయల ప్రవేశం )

— రావోయీ శ్రీరంగా! రా! ఎప్పుడెప్పుడు పిలుపొస్తుందా అని వేచివున్నట్టున్నావు. పిలుపందగానే రెక్కలు గట్టుకని పక్షిలా ఎగిరొచ్చేశావు. వీలయితే - అవకాశాన్ని గ్రద్దలా తన్నుక పోవాలని కూడా చూస్తావు

శ్రీరంగ — (దగ్గరికి వచ్చి జగ్గరాయలు చేతులు పట్టుకుంటూ) మామగారూ! ఏమిటండీ, యింతటి అభాండాన్ని నాపైన వేస్తున్నారు. దైవ సాక్షిగా చెబుతున్నాను. నాకేమీ తెలియదు.

వేంకట:— ఏమిటది? ఏం ప్రశ్న?

జగ్గ:— (రెచ్చిపోయినట్టుగా బిగ్గరగా) ఇదామె కన్నబిడ్డకు సంబంధించిన ప్రశ్న. (ఇంకా బిగ్గరగా) ఇదామె కన్న బిడ్డకు సంబంధించిన ప్రశ్న. ఇదామె....

వేంకట:— చాల్లే. మహారాణీ! నీ అభిమతమేమిటో చెప్పు.

మహా:— చెబుతున్నాను ప్రభూ! తమ అభిమతమే నా అభిమతం మీ అభిమతానికి నేనభ్యంతరం చెప్పను.

జగ్గ — అక్కయ్యా! నీకు మతిగానీ పోలేదుగదా?

మహా — లేదు తమ్ముడూ! భగవదనుగ్రహం వల్ల నాకు మతి బాగానేవుంది.

జగ్గ:— నేన్నమ్మను. ఇందుకు నేను సుతరామూ సమ్మతించను మీరందరూ కలిసి మసిబూసి మారేడు కాయ జేస్తున్నాడు తిమ్మని బమ్మి చేయాలని చూస్తున్నారు! (చేతులు తడుతూ) ఇదిగో - ఎవరక్కడ?

(ప్రవేశం కంచుకి)

— కంచుకీ వెళ్లు చిక్కరాయలు ఎక్కడున్నా రాయలకు ఇక్కడున్నట్టుగా రమ్మనిచెప్పు.

వెంకట:— (కంచుకితో) ఆగు! ఇక్కడికి రావలసిందిగా శ్రీరంగరాయలకు కుడా కబురందించు.

కంచుకి — చిత్తం (నిష్క్రమిస్తాడు).

జగ్గ:— ప్రభూ! తమరు ప్రవాహాన్ని పూచిక పుల్లతో అడ్డు పోయ జూస్తున్నారు.

వేంకట:— ఎట్లాగైనా వివెకవంతుడివయ్యా జగ్గరాయా! పూచిక పుల్లలు ప్రవాహవేగంలో కొట్టుకపోతాయని నీకు బాగా తెలుసు. మరైతే యింక నీకేం దిగులు?

జగ్గ:— (మరింతగా రెచ్చిపోయి) ఒళ్లు పొగలు బోయే మాటలంటూ ఇంకా నీకు దిగులెందుకంటున్నారా? ఈ మాటల

జగ్గ:— తెలుసు, తెలుసు. నువ్వు పాలుతాగే పిల్లివి కాదులే! నక్కవినయాలు కట్టిపెట్టు.

శ్రీరంగ:— యాచమనాయకులవారూ! మీరైనా చెప్పండి. ఏమిటండీ యిది? ఏం జరిగింది?

యాచమ:— జగ్గరాయలవారు ఆగ్రహంతో అకాండ తాండవం చేస్తున్నారంటే అందుకు కారణముందిలే నాయనా! రాజ్యాధిపత్యాన్ని నీకప్పగించాలని సార్వభౌములిప్పుడే నిర్ణయం తీసుకున్నారు.

శ్రీరంగ— (బెంబేలు పడుతూ) మన్నించండి ప్రభూ! ఆ ఉద్దేశం నాకేకోశానా లేదు.

యాచమ:— నీ ఉద్దేశం సంగతికాదు. నేను ప్రభువుల ఆనతిని గురించి చెబుతున్నాను.

శ్రీరంగ:— అయినా నా మనవిని గూడా ఆలకించవలసిందిగా పెద్దల్ని వేడుకుంటున్నాను. రాచనగరులోను, రాజ్యంలోనూ చిరకాలంగా ఒక అభిప్రాయం స్థిరపడిపోయింది. దానిప్పుడు హఠాత్తుగా తిరగ తోడవలసిన అవసరం లేదని నా నమ్మకం

జగ్గ:— కానీ నాకొక సందేహం. ఆ మాట నాలుక చివరినుంచీ వూడిపడిందా? గుండెలోనుంచీ దూసుకొచ్చిందా?

శ్రీరంగ:— చూచారా ప్రభూ! సన్నిహితులైన బంధుముఖ్యులే నా చిత్తశుద్ధిని శంకిస్తున్నారు. ఈ అపార్థాలు, అపోహలు తప్పకుండా అంతఃకలహాలకు దారితీస్తాయి. పెద్దలకెందరికో మనస్తాపం కలుగుతుంది. ప్రజలు పలువిధాలుగా చెప్పుకుంటారు. సామంతులు రెండువర్గాలుగా చీలిపోతారు. కక్షలు, కార్పణ్యాలు, కలహాలు చెలరేగి రాజ్యంలో శాంతిభద్రతలు నశిస్తాయి. అందుకనే మిమ్మల్ని ముకుళిత హస్తాలతో అర్థిస్తున్నాను. సోదరుడు చిరంజీవి చిక్క

రాయలే సింహాసనం పైన ఉండనివ్వండి. భయ భక్తులతో, అభిమాన విశ్వాసాలతో యిప్పటి రాజ్యాంగాన్ని సేవించి నట్టే, యికపైన ఏర్పడే దొరతనాన్ని గూడా నేను సేవిస్తాను. పదవిలో వుండడం గొప్పే కావచ్చు. కానీ ఆపదవిని పరిరక్షించడం మాత్రం గొప్పకాదా ప్రభూ?

(వగర్చుకుంటూ కంచుకి ప్రవేశం)

కంచుకి:— మహాప్రభూ! ఘోరం జరిగిపోయింది - యువరాజు లుంగారు—

జగ్గ:— ఏమైంది కంచుకీ! ఎక్కడ? యువరాజులుంగారెక్కడ?

కంచుకి:— అయ్యో, ఏంచెప్పనండీ! చెప్పడానికి నోరాడడంలేదు తలపగిలి.... నెత్తురు మడుగులో.... యువరాజులుం గారు....

యాచమ:— కంచుకీ! నువ్వు చెబుతున్నది నిజమా?

మహా.— ఈ దారుణానికి ఒడిగట్టిందెవరు? ఇప్పుడు యువరాజె క్కడున్నారు? ఎలావున్నారు? చెప్పవయ్యా బాబూ!

కంచుకి:- నా కండ్లతో నేనే చూచాను తల్లీ!

వేంకట:— వాన లేకనే ఈ పిడుగేమిటండీ యాచమనాయకుల వారూ! అశక్తుణ్ణి, శయ్యాగతుణ్ణి. మీరు వెళ్లండి. (శ్రీ) రంగా! నువ్వూ వెళ్లు, వెళ్లి ఏం జరిగిందో చూడండి.

జగ్గ — ఒక క్షణం ఆగండి. జరిగిందేమిటో నేను చెబుతాను. ఇదంతా ఈ మేక వన్నెపులి ఆడుతున్న కపట నాటకం. అవతల తనబంటుచేత యువరాజును మట్టు బెట్టించాలని ఎత్తువేశాడు. ఇక్కడికొచ్చి ప్రభువుల ఎదుట గొప్ప త్యాగశీలుడిలా నీతులు వల్లించాడు. నా ఈ ఊహే నిజమైతే, నా బిడ్డ ప్రాణలకే గనుక ముప్పువాటిల్లితే - బావగారూ! వినండి. యాచమనాయకుల వారూ, మీరూ వినండీ! అంత పనీ జరిగివుంటే సామ్రాజ్యానికి తుది గడియలు సమీపించాయని నమ్మండి!

(గిరుక్కున వెనుదిరిగి గుమ్మంవైపు రెండడుగులు వేసి హఠాత్తుగా ఆగిపోతాడు. ద్వారంలో రంగనాయకి కని పిస్తుంది, అందరూ నివ్వెరపోయి చూస్తున్నారు. జగ్గా యలు ఆమె ఆకారం చూచి నిర్విణ్ణుడై పోయాడు.)

రంగ:— ఏం జరిగిందో తెలుసుకునే నిమిత్తం నువ్వెక్కడికో వెళ్ల నక్కరలేదు. చెప్పడానికిదిగో - రక్తసిక్త హస్తాలతో నేనే వచ్చాను.

జగ్గ:— (కోపోద్రేకంతో తననుతానే విస్మరించి) నర రూప రాక్షసీ! బిడ్డను పొట్టన బెట్టుకున్నది నువ్వేనా?

రంగ:— ఆహో, ఎంత చక్కనిమాట అన్నావయ్యా జగ్గరాయా! నిజమే! ఇరువదేళ్ల క్రితం వాణ్ణి గర్భాన ధరించినదాన్ని నేనే; ఇప్పుడీ చేతులతో పొట్టన పెట్టుకున్న దాన్నీ నేనే! కానీ వాడిపుట్టుకకైనా, చావుకైనా కారకుడివి నువ్వు! నేను కాదు.

జగ్గ:— నమ్మకండి. దీనికెప్పుడో పిచ్చి పట్టింది. పిచ్చిదాని మాటలకు పాటింపులేదు (చేతులు తడుతూ) ఏయ్, ఎవరక్కడ?

రంగ:— (తేలికగా తీసిపారేస్తూ) నేనిక్కడినుంచీ చెరసాలకు వెళ్లాలని రాలేదయ్యా జగ్గరాయా! ఇక్కడి నుంచీ బయటపడితే - ఇక నాగమ్యస్థానం - శ్మశానమే!

మహా:— రంగనాయకీ! నీవేషం, వాలకం, మాటలు - అన్నీ అయోమయంగావున్నాయి. (నడిపించుకుంటూ వెళ్లి ఆసనం పైన కూచోపెడుతూ) ఇలావచ్చి కూచో! నెమ్మదిగా ఏం జరిగిందో చెప్పు—

జగ్గ:— ఇదేం వైరిబాగుల తనమమ్మా అక్కయ్యా! ఈ నికృష్టు రాలికి స్వాగత సత్కారాలు కూడానా?

వేంకట:— (జగ్గరాయల మాటలు పట్టించుకోకుండా) చూడమ్మా

రంగనాయకీ! నువ్వు శుద్ధ సాత్వికురాలివి నేలపైన నడయాడే చీమకైనా అపచారం చేయనిదానివి. అలాంటి దానివి విడివడిన కేశపాశాలతో, చెదరిన కుంకుమతో, కోపకషాయిత నేత్రాలతో, రక్తమలదుకున్న రుద్రకాళిలా రూపొందావంటే - నిజంగా జరగరాని ఘోరమే జరిగివుంటుంది. ఏమిటమ్మా అది?

రంగ: చెబుతాను ప్రభూ! చెప్పడానికి నాకింక.... మిగిలిన వ్యవధి.... కొద్ది నిమిషాలు మాత్రమే....

జగ్గ — వద్దు దాన్నేమీ చెప్పనివ్వొద్దు....

రంగ:— ప్రభూ! ఈ ధూర్తుడి మాటలు, ఈకుటిలుడి మాటలు నమ్మకండి. నేను హంతుకినైతే కావచ్చు కానీ చంపింది మాత్రం యువరాజును కాదు.

మహా:— చెప్పు రంగనాయకీ! మరెవర్ని?

రంగ:— ఏం చెప్పను మహారాణీ! ఎలా చెప్పను? ఈ భూప్రపంచకంపైన - సృష్టి మొదలైనప్పటి నుంచీ - ఏ ఆడదీ చేసి వుండని, చేయలేని, చేయతగని పని నేనుచేశానమ్మా! (బోరున విలపిస్తూ) నేను నాకన్న బిడ్డనే చంపుకున్నాను.

జగ్గ:— ఛీ.... నోర్ముయ్యవే! దీనికట — కన్నబిడ్డట! విన్నారా ప్రభూ!

రంగ:— (దీనంగా) మహారాణీ! అవసానానికి అత్యంత సమీపంలో వున్నదాన్ని. నూరి, కలిపి, తాగిన ఉంగరపు వజ్రం ఈ నిమిషాన్నో, మారు నిమిషాన్నో నా ప్రాణాలు తీస్తుంది. తలబరువెక్కిపోతోంది. పేగులు ఉండలు చుట్టుకపోతున్నాయి. ఈ సమయంలో నేనబద్ధం చెప్పగలనని మీరనుకోగలరా? చెప్పండి మహారాణి!

మహా:— లేదమ్మా లేదు. నీపైన మాకు చెదరనివిశ్వాసంవుంది....

జగ్గ.— కానీ, అక్కయ్యా! ఇది విశ్వాస ఘాతకురాలు. దెయ్యం పోతూ పోతూ తన కాశ్రయం ఇచ్చిన కొమ్మను విరిచి పోవడంలేదా? ఇదిన్నీ అంతే!

వేంకట:— (చిరాకుతో) శ్రీరంగా! జగ్గరాయలవారి వాగ్బంధనానికి మార్గమేదీలేదా?

శ్రీరంగ:— తమరు తలుచుకుంటే లేకపోతుందా ప్రభూ! మామగారూ! దయచేసి మీరు కొంతసేపు మౌనం వహిస్తారా?

జగ్గ:— బెదిరిస్తున్నావా, శ్రీరంగా?

శ్రీరంగ:— కాదు, హెచ్చరిస్తున్నాను.

మహా:— ఇక నువ్వు చెప్పవమ్మా!

రరగ:— మీ ఉప్పూ పులుసూతిని బ్రతికినదాన్ని! రాజకుటుంబ రహస్యాలు ప్రాణ సమానంగా కాపాడవలసిన దాన్ని ....

వేంకట:— అయినా సరేనమ్మా! దాచిపెట్టిన రహస్యం వలన కలిగే లాభం కంటే, బహిర్గతమైన రహస్యంవల్ల కలిగే నష్టమే - ఒక్కొక్కప్పుడు మానవులకు శ్రేయస్కరం. జంకు గొంకులేకుండా చెప్పమ్మా రంగనాయకీ!

రంగ:— (అర్థిస్తున్నట్టుగా మహారాణి చేతులు పట్టుకుంటూ) చెప్పమంటారా మహారాణీ!

మహా:— (ఖిన్నురాలై తలదించుకుని) నువ్వు చెప్పబోయే దేమిటో నాకు తెలుసునమ్మా రంగనాయకీ!

రంగ:— (కాదన్నట్టు తల అడ్డంగా తిప్పుతూ) తెలిసింది కొంత మాత్రమే! చిక్కరాయలన్న పేరుతో యువరాజుగా వ్యవహరింపబడుతూ వచ్చిన మీ పెంపుడు కొడుకు - నా కన్న కొడుకని మీరెరుగుదురా మహారాణీ!

జగ్గ.— అపద్ధం. పచ్చి అపద్ధం. దీని అపద్ధాలు ఎల్లలు దాటుతున్నాయి.

రంగ:— మహారాణీ! నా కన్న బిడ్డ లోకకంటకుడుగా, అపర కీచకుడుగా, కడకు కన్నతల్లినే కొంగు పట్టుకులాగే పరమకిరాతకుడుగా రూపొందాడంటే - అందుకు నేను కారకురాల్ని గాను. ఈ అనర్థానికంతా కారకుడు అదిగో (జగ్గరాయల్ని నిర్దేశించి చూపుతూ) అతడి జన్మదాత. (ఓపిక లేకపోయినా ఎలుగెత్తి) ఈ నరరూప పశువు రాక్షసరతిలో నన్ను చెరిచాడు. నా గర్భకుహారంలో విషపిండాన్ని నిలిపాడు ఆ గంజాయి మొక్కను తెచ్చి రాచనగరులో పెంచాడు. దాన్ని ఊతగా చేసుకొని సామ్రాజ్యంపైన తిరుగులేని పెత్తనం చలాయించాలని కలలుగన్నాడు. ఏమంటారు మహారాణీ! ఈ రహస్యాలేవీ మీకు తెలియవు గదూ!

మహా:— జీవితంలో చోటు చేసుకన్న ఒక రహస్యమే చాలునమ్మా రంగనాయకీ! అది నాలో భయాలను ప్రోది చేసింది నిండుగా ఇరువదేళ్ల పొడుగునా ఒక భ్రమా ప్రమాదంలో చిక్కుపడిపోయి, ఏదినాన ఏ అవాంతరం జరుగుతుందోనని గుండెల్ని అరచేతిలో పెట్టుకుని దిగులు దిగులుగానే జీవించాను. నా తప్పిదానికీ శిక్ష చాలునమ్మా రంగనాయకీ!

(మహారాణి మాట్లాడుతున్న ఈ సందర్భాన్ని అనువుగా చూచుకుని జగ్గరాయలు తక్కుతూ, తారుతూ వెలుపలికి జారిపోతాడు. అతడి నిష్క్రమణాన్ని గురించి ఎవరూ పట్టించుకోరు.)

రంగ:— కానీ నేను భగవంతుణ్ణి ప్రార్థించేదేమిటంటే. మహారాణీ, నాకు విధించబడిన శిక్షలాంటిది మాత్రం మరే స్త్రీకీ వద్దు. శిథిలగృహంలో పెట్టిన దీపంలా నా జీవితం నిష్ఫలంగా, నిష్ప్రయోజనకరంగా గడచిపోయింది.

అనుకున్నదొకటి. అయింది వేరొకటి. కోరుకున్న దొకటి. దొరికింది వేరొకటి. వద్దు. నా జీవితంలాంటి జీవితం పగవారికైనా వద్దు. జీవిస్తే సంతోషించే వాళ్లుగానీ, చస్తే ఏడ్చే వాళ్లుగానీ లేని ఈ నిరర్థకపు బ్రతుకు నుంచీ స్వామీ! కరుణామూర్తీ! శ్రీనివాస ప్రభో! నాకు.... నాకు.... ('విముక్తి నిప్పించు' అనే మాట వినిపించదు )

(రంగనాయకి తల వాల్చేయబోతున్నదని గ్రహించి శ్రీరంగరాయలు ఏదో ఒక అదృశ్యశక్తి తోసుకొచ్చినట్టుగా ముందుకువచ్చి ఆమె తలను తన ఒడిలోకి తీసుకుంటాడు.)

శ్రీరంగ:— కాదు నీ జీవితం నిరర్థకంగాదు. చూడవూ? కళ్ళు తెరిచి చూడవా రంగనాయకీ! నేను - నీ శ్రీరంగరాయల్ని. చెబుతున్నాను. నీ జీవితం నిరర్థకంగాదు. నీ చరిత్రం పవిత్రం. నీ ధర్మదీక్ష అనితరసాధ్యం. నీమనుగడ సార్థకం.

రంగ:— చాలు ప్రభూ! ఆ మాటచాలు. ఒక కోరిక.... మీ చేతుల్లో కళ్ళు మూయాలన్న ఒకే కోరిక నెరవేరింది. ఈ జన్మకిది చాలు ప్రభూ! (చేతులు జోడించబోతూ) సెలవు - (తలవాల్చేస్తుంది.)

(శ్రీరంగరాయలు అలాగే ఆమె శరీరాన్ని పొదివి పట్టుకుని కూర్చుని వున్నాడు. యాచమనాయకుడు, మహారాణి నిశ్చలంగా నిలబడిపోయారు. వేంకటపతిరాయలు సైతం ఓపిక కూడదీసుకుని పర్యంకం దిగివచ్చి రంగనాయకికి చేరువగా నిలబడతాడు.)

వేంకట:— ఒక దీపం ఆరిపోయింది. ఒక నక్షత్రం రాలిపోయింది. సాధ్వీ శిరోమణి రంగనాయకి వెళ్లిపోయింది.

(తెర జారుతుండగా నేపథ్యంలోనుంచి)

త్యాగమయివమ్మా, లోకహితమ్ము గోరి
జీవితమ్మును నీవు వెచ్చించినావు
ఆంధ్రుల చరిత్రలోన స్వర్ణాక్షరాల
తనరు చుండును లెమ్మ, నీ ధర్మ దీక్ష!





# ఆర్ట్ లవర్స్ యూనియన్ (రి జి) చిత్తూరు.

ఆంధ్రపాఠక లోకానికి సగర్వంగా సమర్పించిన

నాటక, నాటికలు మరియు గేయ సంకలనాలు.

| | |
|---|---|
| సుమాంజాలి (గేయ గుచ్ఛము) | శ్రీ మధురాంతకం రాజారాం |
| పాటలతోట (గేయములు) | ,, |
| పతులు (హాస్య నాటిక) | శ్రీ ఎస్. మునిసుందరం. |
| పూలజల్లు (బాలల నాటికలు) | సంకలనం. |
| క్రీనీడ (సాంఘిక నాటకం) | శ్రీ కిరణ్ . |
| దేశం నీ సర్వస్వం (చారిత్రిక నాటకం) | శ్రీ ఎస్. మునిసుందరం. |
| ధర్మదీక్ష ( ,, ) | శ్రీ మధురాంతకం రాజారాం |



# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 19 | మొనరించు | నొనరించు |
| 8 | 6 | గుర్తెగి | గుర్తెరిగి |
| 13 | 6 | రాయలు | కంచుకి |
| 15 | 24 | అధరించండి | అవధరించండి |
| 31 | 16 | పేతబంధన | సేతుబంధన |
| 42 | 27 | వెండితావశాల | వెండితావళాల |
| 45 | మొదటి పంక్తి చివర 'నియమం' అని ఒక పదం చేర్చుకోవాలి. | | |
| 45 | 25 | ఆహదాల్లో | ఆహావాల్లో |
| 67 | 17 | నిశ్చతంగా | నిశ్చింతగా |
| 73 | ఈ పేజీ తర్వాత వరుసగా 75, 74, 76 పేజీలు చదువుకోవాలి. | | |
| 74 | 25 | శాక్షి | సాక్షి. |